Telugu Classics - Popular Edition Series

ద్విపద

# బసవపురాణము

పాల్కురికి సోమనాథకవి ప్రణీతము

[సంక్షిప్తము]

పరిష్కర్త :

గూడ వేంకట సుబ్రహ్మణ్యం ఎం. ఏ.




ప్రచురణ :

ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవనము :: హైదరాబాదు-4.

# తొలి పలుకు

మూఁడు సంవత్సరాలక్రింద ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వములో సాంస్కృతిక వ్యవహారాల మంత్రిగా ఉండిన శ్రీ ఎం. ఆర్. అప్పారావు గారు చేసిన సూచనల ననుసరించి తెలుఁగు భాషలోని సాహిత్యము అందఱికి అందుబాటులో నుండునట్లుగా ముద్రించి ప్రకటించవలెనని అకాడమీ నిశ్చయించినది. తెలుఁగుభాషలోని పూర్వగ్రంథసముదాయము ఈనాడు పాఠకునికి సక్రమముగా సరసమైన ధరకు లభ్యమగుటలేదు. ఈ లోటును తీర్చి ప్రాచీన గ్రంథ సంచయమును విడివిడిగా ప్రకటించుటకు సాహిత్య అకాడమీ ఒక ప్రణాళికను సిద్ధము చేసినది. ఈ ప్రణాళిక ప్రకారము ఈ కార్యక్రమము మూఁడు తరగతులుగా విభజించనైనది. మొదటిది ప్రాచీనప్రబంధాల ప్రకటన. రెండవది మహాభారతము, భాగవతము, హరివంశము, భాస్కరరామాయణము, బసవపురాణము, భోజరాజీయములను సంగ్రహించి ప్రకటించుట. మూఁడవది భారత భాగవతాలనుండియు నాచన సోమన, కంకంటి పాపరాజు, కూచిమంచి తిమ్మకవి రచనల నుండియు భాగాలను ఏర్చి కూర్చి ప్రకటించుట. మొదటి తరగతిలో 29 ప్రబంధాలను 29 సంపుటాలుగా, రెండవ తరగతిలోని గ్రంథాలను 13 సంపుటాలుగా, మూఁడవ తరగతిలోని గ్రంథాలను 8 సంపుటాలుగా, మొత్తము 50 సంపుటాలను ప్రకటించు కార్యక్రమము స్వీకరించవలె నని అకాడమీ తీర్మానించినది.

ఈ ప్రణాళిక ప్రకారము ప్రతిసంపుటము 1/8 డెమ్మీసైజులో క్యాలికో బైండుతో 200 పేజీల గ్రంథముగా నుండవలెనని నిర్ణయించనైనది. ప్రతి గ్రంథములో గ్రంథకర్తనుగూర్చి, గ్రంథ ప్రాశస్త్యమును గూర్చి వివరించు సుమారు 40 పేజీల పీఠికను చేర్చవలె నని

నిశ్చయించనైనది. చౌకగా పాఠకులకు అందజేయవలెనను ఉద్దేశముతో ఈ సంపుటాల వెల తక్కువగా నిర్ణయించ నైనది. ఇప్పటివఱకు మొదటి తరగతిలో 29 పుస్తకాలను ప్రకటించి ముద్రించుట జరిగినది. ప్రస్తుతము రెండవ తరగతిలోని పుస్తకాల ప్రకటన ప్రారంభమైనది. మేము కోరినంతనే యీ సంపుటము సిద్ధముచేయు బాధ్యతను స్వీకరించి నిర్ణయించిన గడువులోపల వ్రాతప్రతిని అందజేసిన శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యముగారికి అకాడమీ పక్షాన కృతజ్ఞతలు. ఈ తరగతిలోని మిగిలిన పుస్తకాలు ఈ సంవత్సరాంతము వరకు ముద్రితము కాగలవని ఆశించుచున్నాను.

ఈ ప్రణాళికను అమలుచేసి వ్రాతప్రతులను సిద్ధముగావించి ముద్రించుటకు కావలసినడబ్బు మొత్తము అకాడమీకి యిచ్చుటకు రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు వాగ్దానము గావించి యిప్పటివఱకు కొంత డబ్బునుగూడ విడుదల చేసినవి. ఇందుకు అకాడమీ పక్షాన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ధన్యవాదాలు. నిర్ణయించిన గడువులోపల ఈ సంపుటా లన్నిటిని ప్రకటించి ఆంధ్ర పాఠకలోకానికి అందజేయగల మని విశ్వసించు చున్నాను.

హైదరాబాదు
6—1—1969

దేవులపల్లి రామానుజరావు,
కార్యదర్శి.

# విషయసూచిక

## ద్వితీయాశ్వాసము

## తృతీయాశ్వాసము



## చతుర్థాశ్వాసము

## పంచమాశ్వాసము



## షష్ఠాశ్వాసము



## సప్తమాశ్వాసము



---

# పీఠిక

తెలుఁగుకవి తొలిసారిగా నిర్మించిన స్వతంత్రపురాణము బసవ పురాణము. అపార శైవమతాభినివేశమునకును, అపూర్వకావ్యరసావేశము నకును సంగమక్షేత్ర మైన పాల్కురికి సోమనాథుని హృదయసీమ నుండి యవత రించిన ప్రప్రథమాంధ్ర ద్విపద సాహిత్యభారతి యీ కృతి !

పురాణములు :

సామాన్యముగా నొక జాతియొక్క - లేక - ఒక మతముయొక్క సంప్రదాయములను బలపఱచుటకొఱకు చరిత్ర కందని పురావృత్తములను సముజ్జ్వలాధ్యాత్మిక దృష్టితో సముద్ధరించి వ్యాఖ్యానించు లక్ష్యముతో నిర్మింపఁ బడు సారస్వతగ్రంథములు పురాణములు. సంస్కృత పురాణము లట్టివి. తత్కర్త లైన యార్షమనీషులు పురాతత్త్వ జిజ్ఞాసువు లై సర్గప్రతిసర్గాది మహా విషయములను శ్రుతిస్మృతి పరమార్థానుసంధానవృత్తు లై భావించి, దర్శించి వానిని చతుర్వర్గఫలోపాత్తము లగునట్లు మిత్రసమ్మితములుగాఁ బ్రపంచించిరి ; అనంతకాలస్వరూపుఁడై సృష్టిస్థితిలయాత్మక మైన విశ్వసంసార పరిభ్రమణము నకు సాక్షీభూతుఁ డగు పురాణపురుషుని పరతత్త్వమును త్రిభాషల నాశ్రయించి వ్యాఖ్యానించిరి ; ఆగమార్థజలసేచనముచే భారతీయ హృదయక్షేత్రముల నార్ద్రీకరించి యార్షసంస్కృతిసస్యములను బండించిరి ; అమూల్య కథా నిధులను జూపి మురిపించుచు నమోఘ శాస్త్రవిధులను జెప్పి యొప్పించుచు కవిరసిక ముముక్షు జనములయొక్క రచనాప్రసంగ వ్యాసంగముల నుపలాలించు మాతృ మూర్తులుగా పురాణములను దీర్చిదిద్దిరి. కావ్యశాస్త్రములవలెఁ గాక పురాణములు జనసామాన్యము నుద్దేశించి రచింపఁబడినవి. కావున మతవ్యాప్తికి గ్రంథములు శక్తిమంతము లైన సాధనములుగా గుర్తింపఁ బడినవి. శైవవైష్ణవాది మత శాఖాంతరము లన్నియుఁ బురాణముఖమున జనహృదయసీమలందు వ్యాపించి నవి. తత్తన్మతప్రధానదేవతాకములైన పురాణములు ప్రజల మన్ననల నందుకొని నవి. దానిని గమనించిన జైనబౌద్ధములు పురాణతుల్యము లైన మతగ్రంథము లను అవతారకథాసింధువులుగా నిర్మించుకొని జనసామాన్యము నాకర్షించినవి.

ఇట్లు మనదేశమున మతప్రవక్తల ప్రత్యక్ష ప్రవచనములకంటె పురాణకర్తల పరోక్ష హితోపదేశములు మతవ్యాప్తికి మధురమార్గముల నావిష్కరించినవి.

ప్రథమాంధ్ర వీరశైవ పురాణము :

వీరశైవమతము బసవేశ్వర ప్రవర్తితము. 1 క్రీ॥శ॥ 1162-1168 సం॥ల మధ్య కళ్యాణకటకము నేలిన బిజ్జలుని కొలువుకూటమున బసవేశ్వరుఁడు మంత్రిగా, బండారిగా నుండి ప్రభుత్వముతోపాటు భక్తిమహిమలఁ బ్రకటించి తనమతమున కెనలేని ప్రాబల్యము గల్పించెను. దక్షిణాపథమున నాతనిమతము నకు విడిదిపట్టులు విరివిగా లభించినవి. బసవేశ్వరుఁ డెంత తత్త్వవేత్తయో అంత భక్తకవి. అందుచే నతడు తనసమకాలికులను స్వీయగంభీరమతప్రవచనము లచే నుత్తేజపఱచుటతో నాగక తన తరువాతి తరములవారికిని భక్తిరసామృత మందింపఁగల తత్త్వవచనములను గన్నడమునందు లిఖించి యమరుఁడైనాఁడు. అతని యుజ్జ్వల జీవితాధ్యాయము ముగిసిన తరువాత అతనియొక్కయు, అతని యనుయాయుల యొక్కయు వచనగీతములే యతని కీర్తికి పతాకలై నిలచినవి; తన్మత పోషణకు మాతృకలై వెలసినవి. బసవేశ్వరభానుఁ డస్తమించిన తరు వాత నతని కాంతిసారము గైకొని వెలుగొందు భక్తతారకాగణము వెల్లివిరిసినదే కాని సోముఁ డుదయించునంతవఱ కామతజగత్తున సుధాశరచ్చంద్రికలు లేవు.

బసవేశ్వరుఁడు కన్నడిగుఁడు. పాల్కురికి సోమనాథుఁడు బహుభాషా వేత్తయైన తెలుఁగువాఁడు. ఓరుగల్లునకుఁ బండ్రెండు క్రోసుల దూరమున నున్న పాలకురికి యతని జన్మస్థానము. సోమనాథుఁడు కలము పట్టునాటికి తెలుఁగునాఁట బసవేశ్వర వీరశైవమత సంప్రదాయప్రభావ మున్నను, శైవ పండిత త్రయములోఁ దృతీయుఁడైన మల్లికార్జున పండితారాధ్యుల యారాధ్య సంప్రదాయము బలీయముగా నాటుకొని యుండెను. బసవేశ్వర పండితారాధ్యులు సమకాలికు లయ్యు నొకరినొకరు దర్శించుకొనలేక పోయిరి. బసవేశ్వర మహి

---

1. వీరశైవము బసవేశ్వరాద్యుపజ్ఞమే యని కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిలవారి యభిప్రాయము. (చూడుడు : బ.పు. పీఠిక పుట.78-79 ఆంధ్రగ్రంథమాల ప్రచురణము). వీరశైవము బసవేశ్వరోపజ్ఞము కాదనియు, అత్యంత ప్రాచీన మనియు, అది క్షీణదశను బ్రాపింపఁగా బసవేశ్వరుఁ డుద్ధరించి సంస్కరించె ననియు శ్రీ బండారు తమ్మయ్యగారి యభిప్రాయము. (చూడుడు : బ. పు. పీఠిక పుట. 139-146, వావిళ్ల ప్రచురణము).

మను బెలిదేవ వేమనారాధ్యాదుల వలన వినిన పండితుఁడు తనజీవిత చరమావస్థలో నతనిని దర్శింప కల్యాణకటమున కేగుచు, బసవన సంగమక్షేత్రమున లింగైక్య మందిన వార్త మార్గమధ్యమున విని, దుఃఖితుఁడై శ్రీశైలమున కేఁగి యచ్చట జీవితశేషమును గడుపుచు స్వల్పకాలముననే యాతఁడును శివైక్య మందినట్లు తెలియుచున్నది. పండితుఁడు రచించిన శివతత్త్వసారము వీరశైవమతాచార సంపత్తిని, ఆరాధ్య సంప్రదాయమును ప్రతిపాదించు ప్రామాణిక గ్రంథము. సోమనాథుఁడు మొదట ఆగ్రంథప్రభావమునకు లోనై 'అనుభవసారము'ను రచించి తన కవితావ్యవసాయమును సాగించినాఁడు. అపై నాతఁడు శివభక్తకూటములకు సంగమక్షేత్ర మైన శ్రీశైలమును దర్శించు సందర్భములందు బసవని గీతములను, అతని మహిమలను విని యుండ వచ్చును. క్రమముగా నాతని చిత్త మామహాపురుషుని దివ్యమహిమాభివర్ణనము నందాయత్త మగుటచే భక్తిప్రపత్తిరూపము లగు పెక్కు లఘుకృతులను జెప్పఁదొడఁగెను. కాని, ప్రసన్న కవితాసుధాధారగల పాలకురికి వాని పలుకుల వెలఁది జిలిబిలియెలుగులతో గడియ కొక్క వృత్తమున నర్తించుచు వస్తుగౌరవము లేని లఘుకృతులతో నాగక మతప్రవక్త మహిమాన్విత జీవితచరిత్రము చిత్రించు పురాణము గానము సేయ సమకట్టినది. దాని ఫలమే ప్రప్రథమాంధ్ర వీరశైవపురాణ మగు బసవపురాణము !

పురాణ విధము :

బసవపురాణము ఏ పురాణమునకును అనువాదము కాదు. ప్రసిద్ధ మైన మహాపురాణ సంప్రదాయము ననుసరించి పంచలక్షణవిశిష్టముగా నిర్మింపఁబడినదియును గాదు. కాని పురాణశబ్దముతోఁ బుట్టి ప్రఖ్యాతి నందినది. అది దాని ప్రత్యేకత యైనను పురాణసంప్రదాయజ్ఞులు దానిని విమర్శింపక విడువలేదు. పిడుపర్తి సోమనాథుని బసవపురాణమున నిట్లొక యైతిహ్యము కలదు :

సీ. "ఒకనాఁడు శివభక్తు లోరుఁగంటను స్వయం
భూదేవుమంటపమున వసించి
బసవపురాణంబు పాటించి విను వేళ
హరుని గొల్వఁ బ్రతాపుఁ డచటి కేఁగి
యాసంభ్రమం బేమి యనుఁడు భక్తులు బస
వనిపురాణం బర్థి వినెద రనిన

విన నాపురాణంబు విధ మెట్లొకో యన్న
ధూర్తవిప్రుం డొకఁ కర్త చేరి
ఆ. పాలకురికి సోమపతితుఁ డీనడుమను
బెనచె మధ్య (ప్రాస) వళ్లు పెట్టి ద్విపద
యప్రమాణ మిది యనాద్యంబు పద మన్న
నరిగె రాజు" ... ... ... (పీఠిక. 28 ప.)

ఇందలి విప్రుఁడు వీరశైవులను ధూర్తుఁడు కావచ్చును. కాని, యతఁడు పురాణ సంప్రదాయజ్ఞుఁడు. అతనికి పాలకురికి సోమనాథుఁడు పతితుఁడు కావచ్చును. కాని, అతఁడు దేశి సంప్రదాయము ననుసరించి పురాణము నిర్మించిన పరమ మాహేశ్వరుఁడు.

పైకథలో రాజు "ఆపురాణము విధ మెట్టి?" దని ప్రశ్నించెను. "ఆపురాణమును సోమన యీనడుమ ప్రాసవళ్లు పెట్టి ద్విపదలో రచించె" నని విప్రుఁడు పేర్కొనెను. అది యప్రామాణిక మనియు, ననాద్య మనియు విమర్శించెను. ఈ విమర్శ ద్విపదకు మాత్రము పరిమిత మైనది కాదు. ఛందము కావ్యరచనాంగములలో నొక్కటి మాత్రమే. పురాణవిధ మనఁగా పురాణనిర్మాణవిధమును, తద్వస్తు నిర్వహణ విధమును, తల్లక్షణ విధమును గూర్చియు ప్రశ్నించెనని భావించుటకు వీ లున్నది. కావున నావిప్రుఁడు బసవపురాణము సంస్కృతపురాణములవలెఁ గాక వేదప్రామాణ్యము లేని దనియు, అనార్ష మనియు, వానివలెఁ బ్రాచీనము కా దనియు, నవీన మనియు విమర్శించె నని గ్రహింప వచ్చును. ఈ లక్షణములు ప్రాచీన (మార్గ) పురాణసంప్రదాయజ్ఞునకు దోషములుగాఁ దోప వచ్చును కాని దేశి (పురాణ) సంప్రదాయజ్ఞునకు నవీనగుణములుగా స్ఫురింప వీ లగుచున్నది.

## దేశిసంప్రదాయము :

పురాణ లక్షణము లన్నియు సంస్కృతపురాణము లన్నింటియందును బాటింపఁబడి యుండ లేదని విమర్శకులు భావించుచున్నారు. మహాపురాణముల విధమే యిట్లుండ వాని యుత్సవ విగ్రహము లైన యుపపురాణముల సంగతి వేఱుగాఁ జెప్పవలసిన దేమున్నది? ఏమైనను పురాణములలో నత్యంతప్రాచీనము లైన వానియందు సర్గప్రతిసర్గముల కధికప్రాముఖ్య ముండెడిది. క్రమముగా

వంశ మన్వంతరములకును, రాజవంశ చరిత్రములకును ప్రాధాన్యము వచ్చినది. ఆ పైన మతప్రబోధైకదృష్టితో నిర్మింపఁబడిన పురాణోపపురాణముల యందు దేవతా మహిమాభివర్ణనాత్మకము లైన కథలును, అవతారగాథలును, మతధర్మ బోధలును, భక్త చరిత్రములును విశేషముగాఁ జోటు చేసికొనినవి. బౌద్ధులును జైనులును ఇట్టి పురాణసంప్రదాయమును కొంత పరోక్షముగా ననుసరించి జాతక కథలను, జైనపురాణములను నిర్మించుకొనిరి. వీరిలో పురాణ శబ్దమును విరివిగా వాడుకొని వాఙ్మయ నిర్మాణము చేయుటయే కాక ప్రసిద్ధ సంస్కృతేతిహాస కావ్య పురాణకథలను జైనమతానుగుణముగా మార్చి తిరుగవ్రాయుటకును వెను కంజ వేయనివారు జైనులు. కేవలజ్ఞాన సిద్ధిచే ముక్తు లైన తీర్థంకరుల జన్మ మహిమాది విశేషములఁ బ్రతిపాదించుచు తన్మతప్రచారానుగుణముగా నిర్మింపఁ బడినవి జైనపురాణములు. ఇట్టివి సంస్కృత ప్రాకృతములందు కొన్ని వెలసి యున్నను సామాన్యజనుల కందుబాటులో నుండునట్లు వానిని జైనకవులు దేశీయ భాషలలో ననువాదము గావించిరి. ఇట్లు పురాణము పంచలక్షణవిశిష్ట మను ప్రసిద్ధినిఁ గోల్పోయి మత ప్రవక్తలను భగవన్మూర్తులుగా భావించి, భజించుట కును, తన్మతానుయాయు లగు మహాత్ముల వైశిష్ట్యమును, మహిమలను గ్రహించు టకును, పరమతఖండన, స్వీయమత పోషణానుసరణాదుల కైన పరిజ్ఞానము నందించుటకును నేర్పడిన కథాకావ్యములుగా రూపొందినవి. ఇందు చరిత్ర కందని సనాతనుల చరిత్ర లుండక పోవచ్చును. ప్రతీకాత్మక సృష్టి కనుపడక పోవచ్చును. సమకాలికులే పురాణపురుషులుగాఁ గీర్తింపఁబడవచ్చును. పురాణగౌరవము నభిలషించెడి నవీనమతముల యాకాంక్షలు నామశ్రవణమాత్రముననే పౌరాణి కత్వము స్ఫురింపఁజేయు నిట్టి నవీన కావ్యలతికలకు దోహదక్రియ లొనర్చినవి.

దక్షిణ దేశభాషా సాహిత్యములలో నిట్టి పురాణములు మతవాఙ్మయముల కెత్తిన కీర్తిపతాక లై విరాజిల్లు చున్నవి. కన్నడమున ప్రసిద్ధజైనకవులు తీర్థం కరుల చరిత్రలను పురాణములుగా వెలయించిరి. 'ఆదికవి' యని ప్రసిద్ధిగాంచిన పంపకవి (క్రీ. శ. 941) జైనప్రథమ తీర్థంకరుఁ డైన పురుదేవుని చరిత్రమును 'ఆదిపురాణ' మనుపేర చంపువుగా ననువదించెను. అది జినసేనుని సంస్కృత కృతి కనుకృతి. ఇట్లే 'ఉభయకవి చక్రవర్తి' యైన పొన్నకవి పదునాఱవ జైన తీర్థంకరుని జీవిత చరిత్రమును చంపువుగా శాంతిపురాణ మను పేర రచిం చెను. 'కవిచక్రవర్తి' రన్నఁడు ద్వితీయ తీర్థంకరుని చరిత్రను అజితపురాణ

మను పేర చంపూ గ్రంథముగా నిర్మించెను. ఇవికాక నాగచంద్రకవి మల్లినాథపురాణము, నయసేనుని ధర్మనాథపురాణము, జన్నకవి అనంతనాథపురాణము మొదలగునవి ప్రసిద్ధ కన్నడ జైనపురాణములు. ద్రావిడవాఙ్మయమునందు అఱువత్తు మూవురు నయనారు లను శివభక్తుల చరిత్రములను గూర్చి 'శేక్కిౘ్ఝార్' అను కవి రచించిన 'పెరియపురాణము' కడు ప్రసిద్ధి కెక్కి యున్నది. ఇట్లు మతాచార్యుల యొక్కయు భక్తుల యొక్కయు కథలను గుదిగ్రుచ్చి కూర్చి యొక కథాహారముగా సంతరించి పురాణ మను పేరఁ బ్రవర్తిల్లఁ జేయుట కర్ణాట ద్రవిడ కావ్యవస్తు నిర్మాణ పద్ధతులలో నొకటిగా క్రీ. శ. 10వ శతాబ్దమునుండియే గుర్తింపఁబడి యున్నదని తెలియుచున్నది. ఇది ఆర్షము, ఆద్యము నైన సంప్రదాయము కాక దేశీయము, నవీనము నైన కావ్యనిర్మాణ ప్రక్రియగా రూపొందిన దని గ్రహింప వీలగుచున్నది. బసవపురాణ మీసంప్రదాయము ననుసరించి 'పురాణాఖ్య'ను ధరించి ప్రప్రథమ వీరశైవపురాణ మై వాసి కెక్కినది. ఇట్టి రచనల కిదియే తెలుఁగున శ్రీకారము చుట్టినది.

జైనపురాణ ప్రభావము :

సోమనాథుఁడు జైనపురాణ సంప్రదాయముల నెఱుంగుటకు ఓరుగల్లు ప్రాంత మెంతయో తోడ్పడియుండును. ఓరుగల్లు బహువిధమతస్థుల కావాస మైన మహానగర మని విఖ్యాతి నందినది. నన్నయనాటికి తూర్పుచాళుక్య రాజుల వైదికమతాభినివేశముచే వేంగిదేశమున జైనబౌద్ధముల ప్రాబల్యము సడలినది. కాని తెలంగాణమున నంతగా తగ్గలేదు. అందుల కప్పు డాప్రాంతము నేలు రాజులు తూర్పుచాళుక్యులవలె వైదికమతపోషకులు కాకపోవుటయే ప్రధానకారణము. అనుమకొండలోఁ గాకతీయసామ్రాజ్యము సుమారు పదునొకండవ శతాబ్ద్యారంభముననే మొదటి బేతరాజు స్థాపించి యుండెను. అతఁడు జైనమతావలంబుఁడుగాఁ గానవచ్చుచున్నాఁడు. అతని తరువాతివాఁడగు మొదటిప్రోలరాజును జైనుఁడే. కాకతీయ ప్రభువులలో మొట్టమొదట శైవము నవలంబించినవాఁడు రెండవబేతరాజు. అతఁడు పరమమాహేశ్వరుఁడని కీర్తింపఁబడినాఁడు. అతఁడు 11వ శతాబ్ది చరమపాదమునఁ బాలనకు వచ్చినవాఁడు. అప్పటినుండియు నోరుగల్లున శైవమునకు ప్రాబల్య మేర్పడినది. అది శైవజైన మతముల సంఘర్షణములకు దారి తీసినది. గణపతిదేవ చక్రవర్తి వీరశైవాచార దీక్షావ్రతుఁడగుటచే జైనులను, వారి మతమును క్రూరముగా హింసించినట్లు తెలియుచున్నది.

తిక్కన యోరుగల్లు దర్శించినప్పుడు ఆ రాజు జైనబౌద్ధులతో సోమయాజిని వాదుచేయించెనఁట ! తిక్కన వారి నోడించి వైదికమతమును స్థాపించెనఁట ! అప్పుడు గణపతిదేవుఁడు "జినసమయార్థుల శిరములఁ దునిమె"ననియు, "విద్వేషబౌద్ధుల విలుమాడె" ననియు సిద్ధేశ్వరచరిత్రవలనఁ దెలియుచున్నది. ఓరుగల్లు పతనమునకు జైనమతస్థుల పగయు నొకకారణ మని చారిత్రకులు భావించుచున్నారు. ఇట్లు కాకతీయుల పాలనమున నోరుగల్లులో రాజమతముగా దాదా పొక శతాబ్ది వెలసిన జైనము తన పూర్వగౌరవము నిలుపుకొనుటకొఱకు మఱి యొకటిన్నర శతాబ్దికాలము శైవమతముతో నెదురొడ్డి పోరుచు నంతరించినది. జైనము నెదురించి విజయము సాధించుచున్న శైవము సోమనాథునకు క్రొత్తశక్తిని పుట్టుకతోనే ప్రసాదించి యుండును ![1] జైనమతము జనబాహుళ్యమునందు వ్యాపించుట కుపయుక్తమైన వారి పురాణముల విధము సోముని చిత్తముపై కొంత ప్రభావము వైచియుండును. తత్సంస్కారముతో వీరశైవమున కాంధ్ర కర్ణాట జనహృదయసీమలయందు సువర్ణపీఠము కల్పించు బసవపురాణ నిర్మాణము చేపట్టినాఁడు.

వస్తుసంవిధానము :

బసవేశ్వరచరిత్రమే బసవపురాణ ప్రథానేతివృత్తము. సోమనాథుఁడు తన పురాణకథావస్తువును సేకరించుకొనిన విధము నిట్లు చెప్పుకొనినాఁడు.

> "ఆతత బసవపురాతన భక్త- గీతార్థసమితియే మాతృక గాఁగఁ
> బూరితం బై యొప్పు పూసలలోన-దారంబుక్రియఁ బురాతనభక్తవితతి
> చరితలలోపల సంధిల్ల బసవ-చరితమే వర్ణింతు సత్కృతి యనఁగ," ![2]
> "ప్రస్తుతింపంగ సద్భక్తి విస్ఫురణఁ-బ్రస్తుతి కెక్కిన బసవని చరితఁ
> జెప్పితి భక్తులంచే విన్నమాడ్కి - దప్పకుండ గను యథాశక్తిఁ జేసి,"[3]

ఈ వాక్యములవలన బసవపురాణమున కెట్టి నిర్దిష్టమైన గ్రంథము మాతృక కా దనియు, శివభక్తుల వాక్కులయందును, పురాతన భక్త గీతార్థముల

---

1. "జైన మస్తక విన్యస్త శాతశూల కలిత బిజ్జలతలగుండుగండ బిరుదశోభితుఁడు పాల్కురికి సోమనాభిధుండు" (పీఠిక-25) అని పిడుపర్తి సోమనాథుఁడు తన బసవపురాణమునఁ గీర్తించెను.
2. బసవపురాణము (సంక్షిప్తము). ప్రథమ. ఆ. పం. 179-184.
3. బసవపురాణము (సంక్షిప్తము)-సప్తమ. ఆ. పం. 903-906.

యందును వ్యాపించి యున్న బసవకథార్థములను బ్రోగుచేసి, స్వీయప్రతిభతో వానిని రసవత్తరము లొనరించి, సంవిధానము చెడకుండ వానిని గుదిగూర్చి సోమనాథుఁడు పురాణనిర్మాణమొనర్చెననియు స్పష్టమగుచున్నది. సోమనాథుఁ డీపురాణమును భక్తజనకథామంజరిగా సంతరింప భావించినను అం దైక్య మను సూత్రమును బసవని చరిత్రముతో సాధించుటచే నాతని కావ్యవస్తువునకు ప్రబంధసౌందర్య మబ్బినది. సోమనాథుఁడే పండితారాధ్యచరిత్రమున భక్తులు తన బసవపురాణ నూతనత్వమును, అం దితిహాసఘటనవలన కథాకథనమున కేర్పడిన ప్రాబంధ్యమును గీర్తించి నట్లు ప్రత్యేకముగఁ జెప్పుకొనెను.1

బసవపురాణమును సప్తపర్ణి వలె నేడాశ్వాసముల కావ్యముగా సోమనాథుఁడు భావించెను. అందు ప్రథమాశ్వాసమున 'నందికేశ్వరుఁడు బసవేశ్వరుఁడుగా భువి నవతరించుటయు, నుపనయనసంస్కారమును ద్యజించి వీరమాహేశ్వరవ్రతనిష్ఠుఁ డగుటయు, వివాహితుఁ డై సంగమేశ్వరుని శరణువేఁడుటయు వర్ణింపఁబడినవి. ద్వితీయాశ్వాసమున బిజ్జలుఁడు బసవేశ్వరునకు దండనాయకపద మిచ్చుటయు, కళ్యాణకటకమున బసవేశ్వరుఁడు శివాచారనిరతుఁ డగుటయు, చెన్నబసవఁడు బసవు నారాధించుటయు, అల్లమప్రభువు బసవనివిం దారగించి వరము లిచ్చుటయు, బసవేశ్వరుఁడు తన మహిమలు బ్రదర్శించుటయు, జెప్పఁబడియున్నవి. తృతీయాశ్వాసము జంగమునకు బసవేశ్వరుఁడు తనభార్యచీర నిప్పించి తన జంగమసేవానిరతిని బ్రకటించిన కథతో నారంభ మై, సంగయ్య యను ముగ్ధభక్తుని చరిత్రమునకు ముగ్ధుఁడైన చెన్నబసవనికి బసవేశ్వరుఁడు ముగ్ధభక్తుల కథల నెఱింగించుటతో విస్తరించినది. చతుర్థాశ్వాసము మడివాలు మాచయ్య కథతో నారంభ మగును. వీరశైవులు తమబాసలను భక్తిమహిమతో పాటించి జంగమలింగరూపు లై అనన్యసాధ్యు లై వెలుగొందెద

1. "ఖ్యాతిగా సద్భక్త గణలాలనముగ
నూతనంబుగ జగన్నుతముగా మున్న
"బసవపురాణ" మొప్పగ రచించితివి;
బసవపురాణ ప్రబంధంబునందు
ప్రథిత పురాతన భక్తగుణాను
కథనంబు లితిహాస ఘటనఁ గూర్చితివి;"

—పండితారాధ్యచరిత్ర – దీక్షాప్రకరణము, పుట 11.

(ఆం.గ్రం.మా. 30. పరిష్కర్త: డా. చి. నారాయణరావుగారు (1939)

రనుట కాభక్తుని కథ తార్కాణము. బసవఁ డాతనిని సాక్షాచ్ఛివునిగా భావించి సేవించెను. అతఁడే యొకసారి బసవని గీతములో వినవచ్చిన యహంకారమును గర్హించి భక్తివలన భక్తున కత్యంత వినయసంపద యేర్పడవలయు నని ప్రాచీనభక్తుల చరిత్రములను పెక్కింటిని దృష్టాంతములుగాఁ బేర్కొనినట్లు వర్ణించుటచే నీయాశ్వాసము కడు దీర్ఘ మైనది. బసవని సమకాలికు లగు కిన్నరబ్రహ్మయాది భక్తుల మహామహిమలను బ్రతిపాదించుటతో పంచమాశ్వాస మైనది. షష్ఠాశ్వాసము జైనులతో వాదుపడి శిర మిచ్చి మహిమాతిశయములను బ్రదర్శించిన ఏకాంతరామాదులవంటి శివభక్తుల కథలతో నిండియున్నది. సప్తమాశ్వాసము కులమున కంత్యజుఁడయ్యు మహిమచే నున్నతుఁ డైన శివనాగుమయ్య వంటి భక్తుల చరిత్రలతో సాగి, బిజ్జలుఁ డకారణముగా నల్లయ్య మధుపయ్య లను భక్తులకన్నులు తీయించుటచే బసవేశ్వరున కాగ్రహము గలిగి కల్యాణకటకమును శపించి, భక్తమండలితోఁ గూడి సంగమేశ్వరమున కేఁగి లింగైక్య మందుటయు, జగదేవాదులు బిజ్జలుని వధించుటయు, ననతికాలములో నా రాజసంతతియు, రాజ్యమును నాశన మగుటయు నను కథాంశములతో ముగియుచున్నది.

మతాచార్యుని నవతారపురుషునిగా నిరూపించుటయే కాక. తత్పూర్వ జన్మవిశేషముల నభివర్ణించి ఆదిమూల మైన యతనిస్వరూపము నెఱిఁగించి, ప్రస్తుతావతారహేతువును నిర్దేశించిన కథాభాగ మీ పురాణేతివృత్తమున ప్రస్తావనగా నలరారుచున్నది. బసవేశ్వరుఁడు తొలుత సృష్ట్యాదియం దున్న ధర్మస్వరూపుఁ డగు నాదివృషభేంద్రుఁడు. ఆపైన శిలాదుని తపఃఫలముగా నాతఁడు నందీశ్వరుఁ డై జన్మమెత్తి ద్వితీయశంభుఁ డని కీర్తిఁగాంచెను. నందీశ్వరుఁడే శైవమతోద్ధరణకై బసవేశ్వరాఖ్యతో భువియం దవతరించెను. దీనికి సూత్రధారుఁడు పరమేశ్వరుఁడు. ఇంతకంటె పురాణమున కుదాత్తారంభ మేమి యుండును ? సృష్ట్యారంభాఖ్యసర్గాదికథన మార్షపురాణారంభ మై యుండగా ఆచార్యపూర్వావతార కథాకథన మీ పురాణ ప్రస్తావన మై పరిఢవిల్లినది.

జైనపురాణములయందలి తీర్థంకర చరిత్రలలో పంచజినమహాకల్యాణ

ములు వర్ణింపబడు నని అజితపురాణమునఁ జెప్పఁబడియున్నది.1 అవి: 1. సుర లోకావతరోత్సవము – లేక – గర్భావతరణ కల్యాణము 2. జన్మాభిషేకోత్స వము–లేక–జన్మాభిషేకకల్యాణము. 3. పరినిష్క్రాంతి మహోత్సవము–లేక– పరినిష్క్రమణ కల్యాణము 4. కైవల్యబోధోత్సవము – లేక – కేవలజ్ఞాన కల్యాణము 5. పరినిర్వాణ మహోత్సవము – లేక – పరినిర్వాణకల్యాణము. ఇందు ప్రథమకల్యాణకథాసందర్భములందు తీర్థంకరజీవక్రమ వికాసవ్యంజకము లగు పూర్వజన్మకథలు వర్ణితములగుచుండును. వీనిని "భవావళి"యని పిలిచెదరు. తీర్థంకరుల జన్మలకు పూర్వరంగము లైన యిట్టి కథలు పురాణకథావస్తువునకు పూర్వరంగము లై సురలోకావతరోత్సవము ప్రస్తావనాంగతుల్య మై జైనపురా ణములందు కానవచ్చుచుండుటచే బసవేశ్వరపూర్వజన్మవృత్తాంత సంవిధానముపై వాని ప్రభావ మున్న దనుటలో విప్రతిపత్తి యుండదు, ఐనను జైన శైవమత సిద్ధాంతములలో సహజముగా నున్న భేదము ననుసరించి తీర్థంకరులు మానవ స్థితినుండి దేవస్థితి కారోహణక్రమమున గమించి సిద్ధులైనట్లుగను, బసవేశ్వ రుఁడు ఆదివృషభరూపదేవస్థితినుండి కారణజన్ముఁడైన మానవుఁడుగా నవత రించినట్లును నిరూపింపఁబడెను. స్వీయమతానుగుణముగా పురాణనిర్మాణము చేయగల సమర్థుఁ డగుటచే సోమనాథుఁ డీ కల్పనను ప్రశంసావహముగా నిర్వ హించెను. ఇఁక మిగిలిన నాలుగు కల్యాణములును జైనతీర్థంకర జీవితవిధానాను గుణములే. కాని సోమనాథుఁడు వానిని కూడ కథానుగుణముగా మార్చుకొని మతాను గుణముగా కల్పించుకొనెను. అచ్చటి జన్మాభిషేకోత్సవపు తంతువేరు. ఇచ్చటి తంతు వేఱు. సంగమేశ్వరుఁడు ప్రత్యక్షమై "ఈ భవమున కేన చూ గురుఁడ" నని చెప్పి లోకహితార్థమైన యాతని యవతారవిశేషము నుగ్గడించుట, జంగమార్చ నాది విశేషోత్సవములు జరుపఁబడుట మొదలగునవి బసవేశ్వరుని జన్మాభిషేకోత్సవ విశేషములు. అందలి పరినిష్క్రాంతికి బదులిం దుపనయనము మాని బసవన వీర శైవవ్రతదీక్షను గ్రహించుట వర్ణింపఁ బడినది. కైవల్యబోధోత్సవమునకు బదులు సంగమేశ్వరుఁడు బసవన కొనర్చిన ప్రబోధకథాఘట్టము నిర్వహింపఁ బడినది.

---

1. "సురలోకావతరోత్సవం, పరికృతం జన్మాభిషేకోత్సవం, పరినిష్క్రాంతి మహోత్సవం, ప్రవిమలం కైవల్యబోధోత్సవం, పరినిర్వాణ మహోత్సవం, జినమహా కల్యాణ మైదుం సవిస్తర దిందిర్పువు." —రన్నకవి.
(చూడు:– ఆదిపురాణ సంగ్రహపీఠిక. పుట. 56. సంపాదకుఁడు: ఎల్. గుండప్ప. ఎం. ఏ.

పరినిర్వాణ మహోత్సవస్థానమున బసవని లింగైక్యము వర్ణింపఁబడినది. ఇవి యిట్లుండగా శైవమత సంబంధములైన పంచాచారములును, అష్టావరణము లును బసవ జీవిత వృత్తాంతమున బ్రతిబింబించునట్లు సోమనాథుఁడు కథాకల్పనలు గావించెను. ఇట్లు తీర్థంకర జీవిత కథాకథనమునందలి జైనపురాణ లక్షణము లను స్థూలముగా గ్రహించి, ప్రజాదరణ సంపాదనార్థము వీరశైవ ప్రథమ పురాణమునందు ప్రవేశపెట్టినను బసవేశ్వర చరిత్రమును పాల్కురికి సోమ నాథుడు స్వతంత్ర ప్రతిభతోఁ దీర్చిదిద్ది తన వ్యక్తిత్వము ప్రదర్శించెను.

బసవపురాణమున శివభక్తుల కథలు పెక్కు వర్ణింపఁబడినవి. ఆ భక్తు లలో బసవేశ్వరునకు సమకాలీనులైన వారున్నారు. వారిలో అల్లమప్రభువు, ముగ్ధ సంగయ్య, మడివాలు మాచయ్య, సిద్ధ రామయ్య, సకలేశ్వరమాది రాజయ్య, కిన్నర బ్రహ్మయ్య, కన్నద బ్రహ్మయ్య, కలకేత బ్రహ్మయ్య, మోళిగ మారయ్య, ముసిడి చౌడయ్య, సురియ చౌడయ్య, తెలుగు జొమ్మయ్య, ఏకాంత రామయ్య, షోడ్డలదేవు బాచయ్య, సివనాగుమయ్య మొదలగువారు ముఖ్యులు. వీరుకాక పురాతన భక్తులు పెక్కు రీపురాణమున కెక్కియున్నారు. వారిలో చాలమంది ద్రవిడ దేశమున నయనార్లుగాఁ బ్రసిద్ధి చెందియున్న 'యఱువత్తు మూవురి' లోనివారే. వారిచరిత్రలు తమిళమున పెరియపురాణమునందే కాక కన్నడమున హరీశ్వరుని శివగణదరగళె యనుగ్రంథమునందును, గాన నగు చున్నవి. వీనిని సోముఁడు యథావకాశముగాఁ దన పురాణమునఁ బొందుపఱచెను. అయినను సోమన భక్తకథ లన్నియు నొక మూలమునకుఁ గట్టుబడినవికావు; స్వతంత్ర కల్పనా ప్రాయములు.1

శైవసాహిత్యమున 'నఱువత్తు మూవురు' భక్తుల కథ లెట్లున్నవో జైనపురాణములందు త్రిషష్టి శలాకాపురుష చరిత్రము లట్లున్నవి. జినధర్మమును నమ్మి సద్గతి వడసిన మహాపురుషులు అఱువది మువ్వురు కలరని జైన సంప్రదాయము. వారు 24 మంది జైన తీర్థంకుల కంటె భిన్నులు; వారు: 12 మంది చక్రవర్తులు; 24 మంది కామదేవులు; 9 మంది బలదేవులు; 9 మంది వాసుదేవులు ; 9 మంది ప్రతి వాసుదేవులు. వీరికంటె తీర్థంకరులు శ్రేష్ఠులు. వారి చరిత్రలు వర్ణింపఁ బడునప్పుడు పైశలాకా పురుషుల చరిత్రలు యథావకాశముగా

1. బసవపురాణ పీఠిక : శ్రీ వే. ప్రభాకరశాస్త్రిగారు. పుట 29.

జెప్పఁబడుట జైనపురాణవస్తులక్షణములలో ప్రధానమైన దని విమర్శకులు పేర్కొని యున్నారు.1 ఇట్టి జైనపురాణ సంప్రదాయమును గమనించిన సంస్కారముతో, నఱువత్తుమూవురిలో నందఱు వీరశైవులు కాకపోయినను, పురాణ ప్రాశస్త్య సంపాదనార్థము వారి కథలను గైకొని దేశీయమైన సంప్రదాయముతోపాటు శివభక్తాభీష్టమును సోమనాథుఁడు పాటించె నని తలంప వీలగుచున్నది.

సమకాలీన భక్తుల చరిత్రములు బసవనితో ముడివడియున్నట్లును, పురాతన భక్తచరిత్రములు తత్కథాసందర్భములందు దృష్టాంతరూపములుగాఁ జెప్పఁబడినట్లును కూర్చుట సోమనాథుని కథాసంవిధాన నైపుణ్యము. పురాతన భక్తులలో ముగ్ధభక్తులు కొందరు కలరు. "నిక్కమీశ్వరుఁగాని నిజమెఱుంగమిని, ముక్కంటి భక్తులు ముగ్ధులుగారె!"2 అని బసవఁడు ముగ్ధభక్తుల స్వభావమును బేర్కొనెను. వీ రితరభక్తులవలె వీరమాహేశ్వర వ్రతపారీణులై యున్నను అధికముగా సమాయకులు, నిరాడంబరులు, స్నిగ్ధ ప్రవృత్తిగలవారు. స్వచ్ఛమైన వాత్సల్యము, పారవశ్యముతోఁగూడిన భక్తిభావము, వెన్నవంటి హృదయము. శివుని గాంచినంతనే ఆప్తునివలె, మిత్రునివలె, పుత్రునివలె భావించి ముగ్ధభావముతో గీర్తించి, సేవించి లాలించెడి స్నేహస్వభావము వారికి వెన్నతోఁ బెట్టిన సుగుణజాలము. వీరు శివునికొఱకై ప్రాణములనైనను త్యజింపసిద్ధమై త్యాగోత్సాహభక్తివీరులై యొప్పువారు. రుద్రపశుపతి, నక్కనైనారు, బెజ్జమహాదేవి, గొడగూచి, దీపదకళియారు, నాట్యనమిత్తండి, ఉడుమూరి కన్నప్ప, కళియంబ నయనారు, సకలేశ్వర మాదిరాజయ్య, ముగ్ధసంగయ్య మొదలగు ముగ్ధభక్తుల చరిత్రము లీ పురాణ తృతీయాశ్వాసమున వర్ణింపఁ బడియున్నవి.

వీరశైవము భక్తిప్రధానమైన మతము. ఆభక్తి ఆవేశప్రధానమై సాహసోపేతములైన యద్భుతకార్యములచేఁ బ్రపంచిత మగుచుండును. వీరశైవులందు స్వీయమతాభినివేశ మెంత కలదో పరమతద్వేష మంత కాన

1. ఆదిపురాణ సంగ్రహ పీఠిక. పుట 154 సంపాదకుఁడు : ఎల్ గుండప్ప ఎం.ఏ. మైసూరు విశ్వవిద్యాలయ కన్నడ గ్రంథమాల 29. (1959).
2. బసవ పురాణము (సంక్షిప్తము) తృతీయ. 451-452 పంక్తులు.

వచ్చుచుండును. వీరశైవలక్షణములైన పంచాచార, అష్టావరణాదులను గ్రహించిన జంగముఁ డేకులములకు, ఏ వృత్తికిఁ జెందినవాఁ డైనను శివునివలె పూజనీయుఁడే; సహపంక్తిభోజనాదుల కర్హుఁడే. ఇట్టి భక్తి సంప్రదాయము వీరశైవమత ప్రత్యేకతను వ్యక్తీకరించుచున్నది. సోముఁడు వీరశైవమతస్వరూప స్వభావములను స్పష్టపఱచునట్టి విధముగా భక్తకథాసంవిధానమును బసవపురాణమున నిర్వహించెను. వారందఱిలో సాత్త్వికుడుఁగా, అత్యుత్తముఁడుగా మహామహిమాన్వితుఁడుగా బసవేశ్వరుఁడు కానవచ్చుచున్నాఁడు. బసవేశ్వరుఁడు జంగమారాధన మొనర్చు వీరమాహేశ్వరవ్రతాచార్యుఁ డయ్యును అవతారపురుషుఁ డనియు, శివునకును బసవనికిని భేదము లేదనియు నిరూపించుట యీ పురాణ తాత్పర్యము. శివభక్తి యన్నను, బసవభక్తి యన్నను భేదము లేదు. పరమ శివుఁడే "తప్పదేనతఁడని తర్కించిచూడ!" అని పల్కియున్నాఁడు. శివుఁ డవ్యక్తలింగము; బసవఁడు సాకారలింగము. ఇట్లు బసవని శివునితో నభేద మొనర్చుటకై యీపురాణము పుట్టినది. సాకారలింగరూపుఁడైన బసవేశ్వరుఁడు వీరశైవులకు పరమ ప్రామాణికుఁడు; వారిపురాణమున కతఁడే నాయకుడు. అతనియందు భక్త్యావేశము పరాకాష్ఠ నొందినట్లు సోమనాథుఁడు చిత్రించెను.

"వడిఁబాఱు జలమున కొండ లెల్ల కాష్ఠ-పడిఁగాలు చిచ్చున కొడలెల్ల నోష్ఠ
వడివీచు గాడ్పున కొడలెల్లఁ దలలు-వడిచేయు బసవన కొడలెల్ల భక్తి.

ఇట్టినాయకుని వీరశైవ భక్తి చరిత్రము వర్ణింపఁబడిన పురాణము "భక్తివీర" రసప్రధాన మనదగి యున్నది.1 తద్రసపుష్టి సర్వాంగ సుందరముగా నిర్వహింపఁ బడునట్లు సోమనాథుఁడు కథలను తీర్చిదిద్దెను.

మతమునకు విశ్వాస మాధారము; శక్తి భక్తి. విశ్వాసము వీరశైవ భక్తుల యద్భుత మహిమల వలనను, వారు సాధించిన మతవాద విజయముల వలనను పఠితచిత్తమునం దేర్పడును. శివభక్తుల శివారాధన విధాన విశేషముల వలన భక్తి పఠితకు స్ఫురించును. అందును ముగ్ధభక్తుల చరిత్రములు హృదయవాదులను, వీర భక్తుల చరిత్రలు బుద్ధివాదులను అధికముగా నాకర్షింపఁగలుగును. సోమనాథుఁడు బసవపురాణమున బసవని యుదాత్తచరిత్రము ముందుగా కొంత వర్ణించి యతనియందు ప్రామాణ్యబుద్ధిని పఠితకు కల్పించి, ముగ్ధభక్తుల చరిత్ర

1 వీరరసము - జి. వి. సుబ్రహ్మణ్యం, పుట. 253.

లచే పతిత హృదయము నార్ద్రపఱచి భక్తి బీజములను నాటి, మడివాలు మాచయ్య వంటి వీరభక్తుల కథలు చెప్పి శివభక్తిసిద్ధివలన గలిగెడు మహిమలను గీర్తించి, అహంకార విరహిత మైన భక్తి ప్రవృత్తిని పోషింపఁగలుగు దృష్టాంత రూప భక్తకథలను జెప్పియు, కిన్నర బ్రహ్మయ్య వంటిభక్తులకు శివుఁడు పిలిచిన పలుకు మహిమలు కలవనియు, ముసిడి చౌడయ్యవంటి భక్తులు ప్రాణప్రదాన సమర్థు లనియు, ఏకాంత రామయ్య వంటి భక్తులు జైనాదులగు పరమతస్థులను స్వీయమహిమలచే నిగ్రహింపఁ గలుగుదు రనియు, షోడ్డలదేవు బాచయ్య కథ వలన పరమతఖండన శైవమత సంస్థాపన రూపమైన పరిజ్ఞానమును, శివనాగు మయ్యవంటి వారు శివభక్తి సిద్ధి కంత్యకులజు లైనను అర్హు లగుదు రనియు నిరూపించెను. భక్తియుక్తము లైన చిత్తములందే విశ్వాసము నిశ్చలమై నిలుచును. నిశ్చల మైన విశ్వాసము భక్తిని ప్రదీప్త మొనర్చును. కావున పరస్పరాశ్రితము లైన భక్తి విశ్వాసములను సోమనాథుఁడు క్రమవికాస రమణీయముగా నిందు పొందుపఱచెను.

బసవపురాణమున నాయకుఁడు బసవేశ్వరుఁ డైనచోఁ బ్రతి నాయకుఁడు బిజ్జలుఁ డగును. బిజ్జలుఁ డొక వింతప్రకృతికలవాఁడు. బసవని వెలుఁగుక్రింది క్రీనీడవంటివాఁ డాతఁడు. వీరమాహేశ్వరాచారుల మహిమలు చెవులార వినుచు, కన్నులార గాంచుచు, బసవని పూజించుచు, తన్మతమును గౌరవించియు నాతఁడు మాత్రము వీరశైవుఁడు కాలేదు. అగుటకుఁదగిన మౌలికగుణము – విశ్వాస– మతనికి లేదు. దానివలన భక్తి జనింప లేదు. లేనిచో విసమారగించి యపరగరళ కంఠునివలె నొప్పారిన బసవని చరితము ప్రత్యక్షముగఁ జూచిన తరువాత కూడ వీరశైవులకు నిష్కారణహాని తలపెట్టఁగలఁడా? మహారా జైనను, మహాభక్తుని దనకొలువున బండారిగా నిలిపికొనిన పుణ్యాత్ముఁ డయ్యును, భక్తి బీజములు మొల కెత్తఁ జాలని శుష్కకఠినహృదయక్షేత్రము కలవాఁడు. అతనికిఁ గలిగిన కావ్యాంతమరణము సార్థకమే. శివాపరాధమునకు వీరశైవమున మరణమే దండనము కదా! మతపురాణమున మతమూలప్రకృతులైన భక్తి విశ్వాసములు లేని కఠినునిఁ బ్రతినాయకునిగాఁ జిత్రించుట సోమనాథుని కథానిర్మాణ రహస్యము.

బసవపురాణమున బిజ్జల సంహార ఘట్టము చిత్రముగాఁ దీర్పఁబడినది. శివ భక్తుల కపచారము కావించిన బిజ్జలుని శపించి కల్యాణకటకమును వీడి బసవేశ్వ రుఁడు సంగమేశ్వరము చేరుకొనెను. జగదేవదండనాయకు నదివఱకే బిజ్జలసంహా

రార్థము బసవఁడు నిర్దేశించి యుంచెను. అతఁడాపని చేసి, శాసను కాపాడుకొనెను. శాపానుగ్రహశక్తియుక్తుఁడును, ప్రాణప్రదానోపసంహరణ సమర్థుఁడు నైన బసవఁడే బిజ్జలునిఁ జంపి వీరశైవ ధర్మమును గాపాడుకొని యుండవచ్చును కదా! సోముఁ డట్లేల కల్పింపలేదు? సమాధానముగా చరిత్ర అడ్డము వచ్చె నని యైనను చెప్పవలెను. లేక బసవని యుదాత్తచరిత్రము నౌచిత్యసంభరితము చేయ నెంచె నని సమాధాన పడవలెను. లేనిచో కథ నిట్లు మార్చుటలో జైన పురాణ ప్రభావ మున్న దని యూహింపవలెను. మునిసువ్రతుఁ డను నిరువదియవ జైనతీర్థంకరుని చరిత్రమున బలదేవుఁ డగు రామచంద్రుఁడును, వాసుదేవుఁ డగు లక్ష్మణుఁడు నన్నదమ్ము లైనట్లును, ప్రతి వాసుదేవుఁడు రావణుఁ డైనట్లును జెప్పఁబడి యున్నను, రామచంద్రుఁ డాసన్నభవ్యుఁ డగుటచే రావణసంహారము చేయ నొల్లక దూరభవ్యుఁడైన లక్ష్మణునిచే తత్సంహారము నిర్వహింపఁ జేసె ననియు గల్పింపఁ బడినది. జైనులలో దూరభవ్యుల కంటె నాసన్నభవ్యులు కర్మ బంధవిముక్తి నధికముగా సాధించి మోక్షసిద్ధి కతి సన్నిహితు లై యున్నవారుగాఁ బరిగణింపఁబడుదురు. కావున నట్టివారి కెట్టి హింసాకాండ నంటకట్టరు. ఇట్టి జైన పురాణ కథావిధాన సంస్కారమును సోమన గ్రహించి లింగైక్యమందఁబోవు చున్న బసవనిచే బిజ్జలుని సంహారము గావింపఁ జేయక, వైదిక కర్మాసక్తికలిగియు బసవని పూజించిన జగదేవ దండనాయకుని ద్వారమున దానిని నిర్వహింపఁజేసి బసవని విశుద్ధసాత్త్వికశీలసంపదను పరిపోషించె ననుటకు వీలున్నది.

కర్ణాటాంధ్రములయందు[1] జైనపురాణములు వైదికపురాణముల కెదురు నిలిచి ప్రజాదరణ పొందుటకు యత్నించినవి. కన్నడమున కొంతకాల మాపురాణ ములు ప్రజలహృదయసీమలపై రాజ్యము చేసినవి. వానికి పోటీపడి జనాదరణము నొందుటకై వీరశైవులు ప్రథమపురాణ నిర్మాణయత్నము గావించిరి. సోమనాథుని పై నాధార ముంచిరి, అతఁడు జైనపురాణ నిర్మాణములోని లోగుట్టులు తెలిసి

1. చూ॥: ఆంధ్రకర్ణాట సారస్వతములు-పరస్పర ప్రభావము-శ్రీ నిడుదవోలు వేంకటరావు గారు. అధ్యా: తెలుఁగు వాఙ్మయము, నన్నయపూర్వయుగము. ఇందు శ్రీ వేంకటరావుగారు పద్మకవి జినేంద్రపురాణము, (క్రీ. శ. 941) సర్వదేవుని ఆదిపురాణము (క్రీ. శ. 953) మొ॥ జైనపురాణములు నన్నయకుఁ బూర్వమే వెలసిన యాంధ్రానువాదము లని పేర్కొనినారు. పద్మకవియే పంపకవి యనియు, సర్వదేవుఁడే పొన్నకవి యనియు నిరూపించినారు. (కాని వారు జైన పురాణ రచనాప్రభావము బసవపురాణముపైఁ గలదని గుర్తింపలేదు.)

వానిని ప్రచ్ఛన్నముగాఁ గొల్లకొట్టి వీరశైవపురాణము ప్రజల నాకట్టుకొనగల్గు నట్లు నిర్మించెను. ఇట్లనుటచే జైనపురాణలక్షణము లన్నింటిని సోముఁ డనుకరించె నని తాత్పర్యము కాదు. తన గ్రంథప్రణాళిక కొదిగినంతవఱకు వానిని నిపుణముగా గ్రహించి స్వీయప్రతిభతో స్వతంత్ర పురాణ రచనా విధానము నాతఁ డేర్పఱచుకొనెను. బసవపురాణము పుట్టుటతో నాంధ్రమున నార్ష పురాణ రచనా సంప్రదాయ మంతరించుచున్న దనియే కాఁబోలు తిక్కనగారి శిష్యుఁడైన మారన యోరుగల్లులోనే మఱల పురాణధ్వజ మెత్తెను. ఆ పైన పోతన భాగవతము వెలయించెను. సోమనాథుని పుణ్యమా యని దేశిమార్గ సంప్రదాయములలోఁ బుట్టిన పురాణ తరంగిణుల కోరుగల్లు సంగమ తీర్థమై తారసిల్లినది!

ద్విపదరచన :-

పైనఁ బేర్కొనఁబడిన యైతిహ్యమున విప్రుఁడు పాల్కురికి సోమనాథుఁడు ద్విపదలో ప్రాసవళ్లను గూర్చి రచించె నని విమర్శించెను. తెలుఁగుసాహిత్యమున కావ్యరచనమున ద్విపదచ్ఛందమును జేపట్టిన మొదటి కవి సోమనాథుఁడు. తత్కారణమును, తత్సార్థక్యమును సోమనాథుఁడే తనకృతులయందు పేర్కొనియున్నాఁడు.

"ఉరుతరగద్య పద్యోక్తుల కంటె - సరసమై పరగిన జానుఁదెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్య మగుటఁ - గూర్చెద ద్విపదలు గోర్కిదైవాఱఁ;
దెలుఁగు మాట లనంగవలదు, వేదముల - కొలఁదియకాఁ జూడుఁ డిల నెట్లు లనినఁ
బాటి తూమునకును బాటి యౌనేని - బాటింప సోలయుఁ బాటియకాదె?" 1

"లేట తెనుంగున ద్విపద రచింతుఁ - బాటిగాఁ దత్కథా ప్రౌఢి యెట్లనిన :-
జాతులు మాత్రానుసంధాన గణవి - నీతులు గాన 'యనియతగణై'ర
నియును, 'బ్రాసోవా' యనియు, 'యతిర్వా' య-నియుఁ జెప్పు ఛందోవినిహితోక్తిగాన
ప్రాస మైనను యతిపై వడి యైన - దేసిగా నిలిపి యాదిప్రాసనియతి
దప్పకుండఁగ ద్విపదలు రచియింతు - నొప్పదు ద్విపదకావ్యోక్తి నావలదు;
ఆరూఢ గద్యపద్యాది ప్రబంధ - పూరిత సంస్కృత భూయిష్ఠ రచన
మానుగా సర్వసామాన్యంబు గామిఁ - జానుఁదెనుఁగు విశేషము ప్రసన్నతకు;
అట్టునుగాక కావ్యము ప్రౌఢిపేర్మి - నెట్టన రచియింప నేర్చినఁ జాలు
నుపమింప గద్యపద్యోదాత్తకృతులు - ద్విపదలు సమమ భావింప"...... 2

1. బసవపురాణము (సంక్షిప్తము), ప్రథమాశ్వాసము, పం. 165-172.
2. పండితారాధ్య చరిత్ర - దీక్షాప్రకరణము, పుట 18.

"దేసిగా వచియింతు ద్విపదకు వళ్లఁ - బ్రాసంబులునుఁ బొందుపడఁగఁ దావలయు
ననుచుఁ దదీయ సూక్తాక్షరపంక్తిఁ - జెనకక యింతొప్పఁ జెప్పునే యనుచు
సన్నుతిఁ జేయుచు సత్కవు లలరఁ - దిన్ననిసూక్తుల ద్విపద రచింతు ;
నదియునుగా కైహికాముష్మికద్వి - పద హేతువవుట ద్విపదనాఁగఁ బరగు
ద్విపదాంబురుహాముల ధృతి బసవేశు - ద్విపదాంబురుహాము లర్థిఁబ్రీతిఁ బూన్తు.[1]

విప్రుని విమర్శనమును, సోమనాథుని యాదర్శమును బొందుపఱచుకొని చూచినచో నిట్లేర్పఱుపవచ్చును : మార్గపద్ధతి ననుసరించువారు గద్యపద్యాది సంస్కృతభూయిష్ఠ రచనతో నొప్పారు చంపూపద్ధతి వలన కావ్యకళాప్రౌఢి యేర్పడు ననియు, తేటతెలుఁగు మాటలకు తత్సమ పదములకు వలె సర్థశక్తి లేదనియు, వానివలనఁ గావ్యమున కుదాత్తత సిద్ధింపదనియు, ద్విపదచ్ఛందము మహాకావ్యరచన కనువైనది కాదనియు, ద్విపదయందుఁ బ్రాసవళ్లు కూర్చుట లక్షణ విరుద్ధ మనియు భావించుచుండిరి. దేశిసంప్రదాయజ్ఞులు - లేక - సోమ నాథాదులు సంస్కృత పదభూయిష్ఠమైన గద్యపద్యాత్మక ప్రబంధరచనము సర్వ సామాన్యము కాదనియు, కావ్యము సర్వజనసుబోధము కావలయు నన్నచో నది ప్రసన్నము, సరసము నైన తెలుఁగుపలుకుబడితోఁ గూడి, తిన్నని సూక్తు లతో నొప్పారు జానుఁదెనుఁగున వ్రాయఁబడవలె ననియు, వేదములందు సంస్కృత మెట్లో, తెలుఁగు కృతులందు తెలుఁగుపలుకు లట్లే గణనీయము లనియు, దేశీయ చ్ఛందములలో గానయోగ్య మై, ఆబాలగోపాలమున కాదర పాత్ర మగు ద్విపదలోఁ గావ్యరచన మొనర్ప వచ్చుననియు; కావ్యకళాప్రౌఢి ఛందమును బట్టికాక 'అల్పాక్షరముల ననల్పార్థరచనము' చేయఁగల కవి దక్ష తను బట్టి యేర్పడును గావున గద్య పద్యములవలె ద్విపదలుకూడ నుదాత్త కావ్య రచన కుపకరించు ననియు, మాత్రానుసంధానగణవినీతు లగు జాతు లనియత గణము లనియు, అందు దేశిసంప్రదాయము ననుసరించి యాదిప్రాసతోపాటు యతినిగాని, ప్రాసయతినిగాని పాటించిన దోసము లేదనియు, భక్తిప్రధానము లగు కృతులం దైహికాముష్మిక ద్విపద హేతువుగా ద్విపద సార్థక మగు ననియు, తత్కావ్యరచనపఠనాదు లొక యారాధన విశేష మనియు దలంచు చుండిరి. మార్గకవులు దేశికవులను ప్రామాణికులుగా గ్రహింపరు. దేశికవులు మార్గకవు లను సరకుసేయరు.

1. పండితారాధ్య చరిత్ర. దీక్షాప్రకరణము. పుట. 21 - 22.

సోమనాథుఁడు ప్రజాసామాన్యము నుద్దేశించి ద్విపదలో పురాణము నిర్మించెను. దానిని కొందఱు విమర్శించిరి. దానికి సమాధానము విపులముగాఁ బండితారాధ్య చరిత్రలోఁ జెప్పెను. ప్రాసయతి ప్రయోగమునకు ప్రమాణము చూపించెను. పైనఁ జేర్కొనఁ బడిన యైతిహ్యము పండితారాధ్య చరిత్ర రచనకుఁ బూర్వమే సంఘటిల్లె నని తెలియుచున్నది.

జనబాహుళ్యమున కందుబాటులో నుండునట్లు సంస్కృతమునం దనుష్టుప్పులవంటి సులభగ్రాహ్యము లైన శ్లోకములలో పురాణములు రచింపఁబడి యున్నవి. తెలుఁగున నిట్టి సరళసుందర మైన ఛందము ద్విపదగా నెఱింగి సోమనాథుఁడు పురాణము నందులో రచించెను. మతము ప్రజాసామాన్యమునందు వ్యాపింపవలె నను లక్ష్యముతో నిర్మింపఁబడు సారస్వతమున ప్రౌఢకావ్యకళా సృష్టికంటెఁ బ్రజాదరణపాత్ర మగు దృష్టియే యధికముగాఁ గాంచ నగును. సంస్కృతసాహిత్యమర్యాదల నాదరించి యనుసరించు మార్గకవులు తెలుఁగున వెలయునాఁటికే సంస్కృత సాహిత్యమున మహాకావ్య రచనము పరిపక్వ దశ నంది యున్నది. కావున వా రితిహాసము చేపట్టినను, పురాణము ననువదించినను, కావ్యము సంతరించినను వానిని కావ్యాలంకారకళాబంధురములుగాఁ దీర్చ సమకట్టిరి. అందువలనఁ దెలుఁగున కావ్యము తత్కళావిదులను మెప్పించి మనుగడ సాగింపవలసి వచ్చెను. అందుచే జనసామాన్యము కొఱకైన తెలుఁగు ద్విపద పురాణము వారి కాదరపాత్రము కాలేదు. అట్లని సోమనాథుఁడు తన మార్గము వీడలేదు. తన లక్ష్యమును, ఆదర్శమును తేటపఱచి తనకావ్యము నాదృక్కోణముతోఁ జూడు మనినాఁడు, అట్లు చేయనిచో మూలవిచ్ఛేద రూప మగు పాండిత్యమును వెలార్చినట్లే యగునుగదా!

జానుఁదెనుఁగు :

పై సోమనాథుని స్వతంత్రాశయములు ముఖ్యముగా భాషాసంబంధ మైనవి; ఛందస్సంబంధ మైనవి. 'ఆరూఢగద్యపద్యాది ప్రబంధపూరిత సంస్కృత భూయిష్ఠ రచన సర్వసామాన్యము కాదు కావున ప్రసన్నతకు జానుఁదెనుఁగు విశేష మని యతని యభిప్రాయము. జానుఁ దెనుఁగునకు తుల్యార్థకములుగా తేట తెనుంగు, తెలుఁగు మాటలు, తిన్నని సూక్తులు అను సమాసములను సోమన వాడియుండెను. అంతియకాక తన వృషాధిప శతకమున జానుఁ దెనుఁగునకు లక్ష్య మగు పద్యము నిట్లు రచించెను.

"చ. బలుపొడతోలు సీరయును బాఁపసపుల్ గిలుపారు కన్ను వె
న్నెలతల నేఁదుఁగుత్తుకయు నిండిన వేలుపుటేఁటు వల్గుపూ
సలు గల తేని లెంక వని జానుఁదెనుంగున విన్నవించెదన్
వలపు మదిన్ దలిర్ప బసవా బసవా బసవా వృషాధిపా !"

ఇందుఁ దత్సమపద విరహిత మైన తేట తెనుఁగు కలదు. దీని నచ్చ తెనుఁగని మనము పిలిచెదము. కావున జానుఁదెనుఁ గనఁగా నచ్చతెనుఁగనియే యొకరు భావించిరి. ఒకరు 'సొంపైన తెనుఁ'గనిరి. మరియొకరు 'సర్వ సామాన్యమగు ప్రసన్నమైన తెనుఁ'గనిరి.[1] మరియొకరు కేతన ఆంధ్రభాషా భూషణములో నచ్చతెనుఁగునకును, దేశికి నిచ్చిన యుదాహరణములను బోల్చి చూచి జానుఁదెనుఁగునకును వానికిని భేదము లే దనిరి.[2] ఇంకొకరు కన్నడ కవులు పేర్కొనిన "పొసదేసె" "జాణ్నుడి" వంటిది జానుఁదెనుఁ గనియు, 'జాణత్వముతో చమత్కార యుక్తముగాఁ బ్రయోగింపఁబడిన తెనుఁ' గని యర్థము చెప్పవచ్చు ననియు నూహించిరి.[3] ఇంకొకరు 'జానుఁదెనుఁగునందు సంస్కృతపదములు లేకుండ నుండవలయు ననికాదు. దేశీయపదము లధికముగా నుండుటయు, సంస్కృతపదములు మృదువులును సులభములునై యుండుటయు జానుఁదెనుఁగు కవిత్వ లక్షణ' మనియు నెఱిఁగించిరి.[4] ఇట్లు జానుఁదెనుఁగును గూర్చి పండితులు బహువిధములుగా భావించుచుండుటచే దాని నిదమిత్థ మని తేల్చి చెప్పుటకు వీలు లేకున్నది. కాని జానుఁదెనుఁగున కవిత్వము వ్రాసెద నని సోమనాథుఁడు చేసిన ప్రతిజ్ఞకు బసవపురాణ పండితారాధ్య చరిత్రములు లక్ష్యములు కావలసియుండఁగా పై పద్య మొక్కటి మాత్రమే దానికి సమగ్రోదాహరణము కాఁజాలదు. ఏలయన బసవపురాణము పై పద్యమువలె నచ్చతెనుఁగున వ్రాయఁబడలేదు. అట్లని అందలిది జానుఁదెనుఁగు కాదనుట కవి ప్రతిజ్ఞకు విరుద్ధము. కావున వీనిని సమన్వయింపవలెను. సోమనాథుఁడ

---

1. కుమారసంభవము – (మద్రాసు విశ్వవిద్యాలయ ప్రచురణము. 1948) పీఠిక. సంపాదకులు : శ్రీ కోరాడ రామకృష్ణయ్య, యస్. లక్ష్మీపతి శా గారలు – పు: 29–30.
2. నన్నెచోడుని కవిత్వము – శ్రీ వేదము వేంకటరామశాస్త్రిగారు. పుట 109–11
3. కుమారసంభవము. (మ. వి. ప్ర.) పీఠిక. పుట 30.
4. ఆంధ్రకవితరంగిణి. శ్రీ చాగంటి శేషయ్యగారు. సంపుటము 13. పుట 104.

బసవపురాణ పండితారాధ్య చరిత్రలందు ప్రధానముగా సంస్కృత సమాస భూయిష్ఠమైన యోజోబంధమును గర్హించెను. కావున తత్సమ, తద్భవ, దేశ్యాది భేదముచే నొప్పారు తెనుఁగు పదజాలమున నతఁడు తత్సమ వైరళ్య మును, దేశ్యబాహుళ్యమును, ఉక్తిసారళ్యమును వరించె ననియు, నట్టి లక్షణ ముల సంయోజనరూప మైన రచనమే జానుఁదెనుఁ గనియు, నది సర్వజన సామాన్య మనియు సోమనాథుఁడు భావించె నని తలంప వచ్చును.

తెలుఁగుముద్ర :

దేశిరచనా సంప్రదాయము నుద్ధరించిన సోమనాథుఁడు జానుఁదెనుఁగున ద్విపదకావ్యములు రచించి తెలుఁగు దనమును పోషించె నని కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగా రిట్లు పేర్కొనిరి. "తెలుఁగునకుఁ దోడిభాష యగు ద్రవిడ భాషలో దేశిరచన లెక్కువగా నెక్కొన్నవి. ద్రవిడదేశీయు లగు జైనులయు, శైవులయు, వైష్ణవులయు దేశిచరిత్రములు ద్రవిడభాషా సహజము లగు దేశి వృత్తములలో రచితము లై వెలసియున్నవి. కర్ణాటకమున నంతగా నట్టి రచనలు లేవుగాని తెలుఁగున కంటెఁ గొంత హెచ్చుగా నున్న వనవచ్చును. ఆదికాల మునఁ దెనుఁగు గ్రంథములు ప్రాయికముగా సంస్కృతభాషలో నున్న పురాణా ద్యార్యగ్రంథముల కనువాదములుగానే వెలయుటచే నాంధ్రసహజము లైన దేశిరచనల కాదరువు సన్నగిల్లెను. మన పూర్వులు పౌరాణికము లయిన యార్య కథల మీఁదను, సంస్కృతచ్ఛందస్సు మీఁదను, సంస్కృతప్రాయ మయిన తత్సమభాష మీఁదను నభిమానము గలవారయి దేశీయేతివృత్తములను, దేశీయ చ్ఛందస్సులను, దేశిభాషను జితుకఁద్రొక్కిరి. నేఁడు మనము స్త్రీపామరాదుల గేయరచనము లని యనాదరమునఁ జూచు పదరచనముల వరుసలే ద్రవిడభాష లోని ప్రౌఢకావ్యములందలి వృత్తములుగా నెలకొన్నవి. తరువోజ, ద్విపద, రగడ, అక్కర, గీతి, సీసము మొదలగు పరిమితజాతులే దేశిచ్ఛందో జని తములు మనగ్రంథములం దాదృతము లయ్యెను. ఈ దోషముచే మన తెలుఁగు ప్రబంధములం దాంధ్రతాముద్ర యంతగాఁ గానరాకున్నది. కొంతవఱ కాంధ్రతా ముద్ర నచ్చొత్తి ప్రబంధముల రచించిన వారిలో నగ్రగణ్యుఁ డీ సోమనాథ కవియే. ఈతఁడు దేశీయ కథలను దేశిచ్ఛందోజనిత మగు ద్విపదమున దేశి తెనుంగు బాసలో రచించినవాఁ డగుటచే నీతని కవితలో నాంధ్రతాముద్ర సక్కఁగా నత్తికొనెను".1

1. బసవ పురాణము. (ఆంధ్ర గ్రంథమాల) – పీఠిక – పుట 54–55.

ప్రాసవడి :

సోమనాథుఁడు ద్విపదలో వాడిన 'ప్రాసయతి'ని సమర్థించు శ్రీ బండారు తమ్మయ్యగారి వాక్యములు స్మరింపఁదగినవి : "ఆంధ్రభాషలో సోమనాథుని కాలమునాఁటికి ఛందోవ్యాకరణలక్షణ గ్రంథము లేమైన వెలసినవో లేదో యెవ్వరు నింతవఱకు రూఢిగాఁ జెప్పఁజాలకున్నారు. ఇప్పటి కుపలబ్ధము లైన వానిలోఁ బ్రాచీనము లని మనము గణించు కవిజనాశ్రయము, కావ్యాలంకార చూడామణి, ఆంధ్రశబ్ద చింతామణి, ఆంధ్రభాషాభూషణము మున్నగునవి యెల్ల సోమునకుఁ దరువాతివే గాని ముందరివి గావు. ద్విపదలలోఁ బ్రాసయతి చెల్లదను లక్షణము సోముని తరువాతఁ జాలఁగాలమునకు వెలసిన చిన్నన్నలు చెప్పినదే కాని యాతనికి ముం దుండిన తొల్లింటి పెద్ద లేర్పరచినది గాదు. కవిజనాశ్రయములో నిందుఁగూర్చి యేమియుఁ జెప్పియుండలేదు. ద్విపదలలోఁ బ్రాసయతి చెల్లుననుటకు సాధకముగ "అనియతగణైః" "యతిర్వా" "ప్రాసోవా" యను ప్రాచీనచ్ఛందస్సూత్రముల నాంధ్రభాషా చ్ఛందోలక్షణములఁ జెప్పు చు సంస్కృతభాషలో రచిత మైన యేఛందోగ్రంథమునుండియో సోమనాథుఁడు పేర్కొనియే యున్నాఁడు. యతిప్రాసనియమము లేని సంస్కృతశ్లోక రచనము లకుఁగాని, యతినియమము లేని కర్ణాట పద్యరచనములకుఁగాని యీ సూత్రములు సంబంధించినవి గావని చెప్పనక్కరలేదు. అక్షరగణబద్ధము లై, చతుష్పాదనియతి గల వృత్తములందును, అనియతగణబద్ధము లయ్యుఁ, జతుష్పాదనియతి గల కందము, ఉత్సాహము, అక్కర మున్నగు జాతులందును పాద ద్వితీయాక్షర ప్రాస నియమ మున్నదన్న కారణమునఁ గాఁబోలు వీనిలోఁ బ్రాసయతి పనికి రాదనియుఁ జతుష్పాద నియతిగల్గియుఁ బాదద్వితీయాక్షర ప్రాసనియమము లేని సీసము, తేటగీతి, ఆటవెలఁది మున్నగు నుపజాతులందు, సంగీతమునందు నది చెల్లుననియుఁ దలంచు సంప్రదాయ మాంధ్రచ్ఛందోలక్షణగ్రంథములలో నేర్పడినది. అక్షరగణబద్ధము లై చతుష్పాదనియతి గల లయగ్రాహి, లయహారి, లయవిభాతి, త్రిభంగి మున్నగు కొన్ని వృత్తముల విషయమున మాత్రమందు లయప్రాధాన్య మున్నదన్న కారణమునఁ గాఁబోలు మరల నీ లక్షణ గ్రంథకర్తలు ప్రాసయతినే విధించియున్నారు. ఇవియన్నియు నర్వాచీన లక్షణములే యని తలంపఁదగును. అనియతగణబద్ధ రచనములలోఁ జతుష్పాద నియతితోపాటు పాదద్వితీయాక్షర ప్రాసనియమ మున్న జాతులమాట యెట్లున్నను, ఇట్టి ప్రాస

నియమ ముండియు ద్విపాద నియతి మాత్రమే గల ద్విపద, రగడ, అట్టి ప్రాస నియమము లేని మంజరీ ద్విపద మున్నగునవి పాటలుగాఁ బాడుకొనుట కనువగు గేయకృతు లగుటచే సంగీతమునందు వలె వానిలోఁగూడఁ బ్రాసయతిని వాడ వచ్చు ననుటయే ప్రాచీనచ్ఛందోలక్షణకర్తల మతముగా గోచరించును. మనభాషలో గ్రంథస్థము గాక తరతరములనుండి పారంపర్యముగ జనుల నోళ్లలోఁబడి ప్రచారనుందున్న యలేఖ్య గేయ వాఙ్మయ మెంతయో యున్నది. ప్రాఁతపాట లనుపేరితోఁ గొందఱు భాషాభిమానులు వీనిని సేకరించి యిప్పు డందందుఁ బ్రకటించు చున్నారు. ఇవి చాలవఱకు ద్విపదరూపములుగనో, త ద్వికృతులుగనో యుండును. వీనికాలమును నిర్ణయించుట దుస్తరము. నన్నయకు ముందునుండియు వెలసినవిగూడ నిందుఁ బెక్కులు చేరియుండును. వీనిలో నందందుఁ బ్రాసయతి గాననగును. మచ్చునకుఁ గొన్ని యుదాహరింతును.

> "అత్తింటి కోడలు ఉత్తమురాలు – చేట జొన్నలు పోసి చేనిద్రపోను."
> "చక్కనాన్నగారి ముక్కుపై చెమట – చేరుడేసి ముత్యాలు చెదరినట్లుండు."
> "చలికి వెఱచినట్టు పులికి నే వెఱవ – అలికి వెఱచినట్లు అమ్మ కే వెఱవ."
> "కొడుకులఁ గనని వాళ్లకడు పేమికడుపు–కుల ముద్ధరించనా కొడు కేమి కొడుకు."

కావున నిట్టి ప్రాచీనమతము ననుసరించియే సోమనాథుఁడు ద్విపదలందు రగడ లందుఁగూడఁ బ్రాసయతిని వాడి యున్నాఁడు".1 "ప్రాసమైనను యతిపై వడి యైన – దేసిగా నిలిపి యాదిప్రాసనియతి – తప్పకుండగ ద్విపదలు రచియింతు" నని యెలుగెత్తి చెప్పిన సోమనాథుని హృదయమును తమ్మయ్యగారు చక్కఁగా నావిష్కరించినారు.

బసవపురాణము నిట్లు పురాణకల్పనమునందును, వస్తుసంవిధానము నందును ఛందోనిర్వహణమునందును, భాషాప్రయోగమునందును దేశీయము లైన సంప్రదాయములను, నవీనగుణములను మేళవించి ప్రథమాంధ్ర స్వతంత్ర ద్విపద పురాణముగా సోమనాథుఁడు నిర్మించెను.

---

1. బసవ పురాణము (వావిళ్ల ప్రచురణము) పీఠిక – పుట 99–102 (గౌరన రంగనాథాదులు కూడ ప్రాసయతిని క్వాచిత్కముగాఁ పాటించి రని వీరు పేర్కొని యుండిరి.

కవి జీవిత విశేషములు :

ప్రాచీనకవు లందఱి వలెనే పాల్కురికి సోమనాథుఁడును స్వీయ చరిత్ర నేమియు తనకావ్యములలోఁ జేర్కొనలేదు. కాని యెడనెడ నాతఁడు తననుగూర్చి చెప్పుకొనిన మాటలనుబట్టి యతనికథను మన మూహింప వలసి వచ్చుచున్నది. ఇట్లూహించుట కతని కృతులే కాక ఏకామ్రనాథుని (క్రీ.శ. 14వ శతాబ్దము) ప్రతాప చరిత్ర మను వచనగ్రంథము, పిడపర్తి సోమనాథుని (క్రీ.శ. 15వ శ.) పద్య బసవపురాణము, శైవకవియొకఁడు రచించిన అన్య వాదకోలాహల మను సీసపద్య శతకము, తుమ్మలపల్లి నారనారాధ్యుని ద్విపద బసవ విజయము, తోంటదసిద్ధ లింగకవి (క్రీ. శ. 16వ శ.) కన్నడమున రచించిన పాలకురికి సోమేశ్వరపురాణము, ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోని స్థానిక చరిత్రములు మొదలగునవి కొంత తోడుపడుచున్నవి. వీనిలో చాలవఱకు ప్రతాపచరిత్రయందు సోమునిగూర్చి చెప్పఁబడిన యంశములే పునరావృత్తము లైనవి. చారిత్రకులు వీనిని ప్రామాణికములుగా గ్రహింపరు. కాని పరం పరగా వచ్చుచున్న యీ కథలన్నియుఁ బుక్కిడి పురాణము లని త్రోసివేయు టకును వీలులేకున్నది. కావున కొందఱు విమర్శకులు కావ్యాంతర సాక్ష్యములు చారిత్రక నిదర్శనములు, శాసనాధారములు, ఆంధ్రకర్ణాటక కవిస్తుతులు మొద లగువానిని ప్రాతిపదికలుగాఁ గైకొని వాని కనువైనంతవర కీ కథార్థములను సమన్వయించుకొనుచున్నారు. ఏమైనను పాల్కురికి కవినిగూర్చి తెలిసిన పరిమిత చరిత్రలోఁ బ్రధానాంశము లన్నింటిపైనను వాదోపవాదములు వెలసి యున్నవి. వాని నన్నింటిని జేర్కొని, వాని యారంభసంరంభాదులను, వాద ప్రతివాదములను నిరూపింపఁ బూనినచో నదియు నొక పురాణము కాఁగలదు. కావున నాయంశములను దిఙ్మాత్రముగా నిందు పొందుపఱచుట యైనది.

జన్మస్థలము :

గ్రామనామమే గృహనామముగాఁ గలవాఁడు పాల్కురికి సోమనాథ కవి.[1] ఆపాల్కురికి[2] తెలంగాణమున నోరుగల్లునకుఁ బంద్రెండు క్రోసుల దూరమున జనగామతాలుకాలో నున్న నేటి 'పాలకుర్తి' యనియు, అదియే కవి

1. చాగంటి శేషయ్యగా రీవిషయము నిదమిత్థమని నిర్ణయింప వీలులే దనిరి.
2. దీనికి పాల్కురికి, పాలుకురికి, పాలకురికి యనియు – కురికికి – కుఱికి యనియు రూపములు కలవు.

జన్మస్థాన మనియు విమర్శకులు గాఢముగా విశ్వసించుచున్నారు. కాని కీ. శే. చిలుకూరి నారాయణరావు పంతులుగారు మైసూరు రాష్ట్రమున తుమకూరు జిల్లాలో నున్న "హాలకురికె" యను గ్రామమే "పాలకురికి" యై యుండవచ్చు ననియు, కన్నడమునందలి "హ" వర్ణము తెనుఁగున "ప" గా మారుట సహజ మనియుఁ, బేర్కొని యుండిరి. 1 కర్ణాటకవి చరిత్రకర్త లగు శ్రీ నరసింహాచార్యులుగారును, కన్నడ సారస్వత (Kanarese Literature) మను గ్రంథమును రచించిన రైసుదొరగారును పాలకురికి గోదావరి జిల్లాలో నున్న దని యూహించిరి. ఈ రెండు వాదములును నేఁ డంగీకరింపఁబడుటలేదు. పై పాలకురికి తెలఁగాణము నందున్న దే యని నిశ్చయించుటకు తోంటద సిద్ధలింగకవి సోమేశ్వర పురాణమును, అన్యవాదకోలాహల శతకమును, ప్రతాప చరిత్రమును, పిడుపర్తి సోమనాథుని బసవపురాణమును2 జెప్పెడి మాటలు తోడుపడుచున్నవి. ఇంకను పాలకుర్తిలో వెలసియున్న స్వయంభు వగు సోమేశ్వరుని యాలయము, సోమనాథుని యాశ్రమస్థలి (సమాధి ?) పై నతని శిష్యులచే స్థాపింపఁబడిన 'సోమనాథుని లింగము,' సాక్ష్యము పలుకుచున్నవి. పాలకుర్తి ప్రసిద్ధ శైవక్షేత్ర మగుటయు, బసవపురాణావతారికలోఁ బేర్కొనఁబడిన కట్టకూరి పోతిదేవర నివాసస్థల మగు కట్టకూరు పాలకురికి సమీపముననే యుండుటయు నీ వాదమునకు బలము చేకూర్చు చున్నవి. నేటి పాలకుర్తికి సమీపమున నున్న ఎలకుర్తి, ఉఱుకుర్తి యను గ్రామములు కాకతీయుల కాలమున ఎలకురికి,

---

1. పండితారాధ్య చరిత్ర (ఆంధ్రగ్రంథమాల) పీఠిక- పుట 1-7. వీరి వాదము ననుసరించిన వారిలోఁ బ్రముఖులు శ్రీ చాగంటి శేషయ్యగారు, చూడు: కవిత్రరంగిణి సంపు. 3. 117-119.

2. "పిడుపర్తి బసవన బసవపురాణమున నీవిషయము గానరా దని కొంద ఱనవచ్చును. అందు "కలిమలభంగచంగ శివగంగకు: జెంగటఁ గల్కొమన్పురిన్" అనియుండ వలసినచోట నచ్చుతప్పు, "శివగంగకు: జెంగటఁ గల్గుమత్పురిన్" అని పడిన దని కీ.శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు బసవపురాణ పీఠికాధస్సూచికలో పేర్కొనిరి. (పుట. 8); అంతియకాక పైనఁ బేర్కొనఁబడిన యైతిహ్య మోరుగల్లున జరిగిన దనియు, శివభక్తు లోరుగంటికి తత్సమీపగత మగు పాలకురికి నుండి పాల్కురికి సోమనాథుని బిలుచుకొని వచ్చి రనియు స్పష్ట మగుచున్నది.

ఉఋకురికి యని వ్యవహరింపఁబడుచున్నట్లు శాసనాధారము లుండుటచే[1] పాల కుర్తియు నాకాలమున పాలకురికి యని పిలువఁబడుచుండె నని భావింప వీలగు చున్నది. ఇవి యిట్లుండ దేశిమార్గ పురాణధ్వజము లెదురెదురుగా నిలువఁబెట్టిన సోమనాథమారనలు ఓరుగల్లు ప్రాంతమువా రనుటయే సంభావ్యము !

శ్రీ నిడుదవోలు వేంకటరావుగా రన్నట్లు:- "ఇంతకు సోమనాథుఁడు కన్నడదేశమున తెనుఁగుదేశమున కంటె విశేష ప్రసిద్ధి గడించిన వాఁడు కదా ! అతని నెందరో కన్నడకవులు స్తుతియించి యున్నారు. అతఁడు నిజముగా కన్నడదేశస్థ మైన హాల్కురికి గ్రామనివాసి యైనచో నొక్కకవి యైన యాతని పాల్కురికి సోమనాథుఁ డని పేర్కొనలేదు. ఇది యొకటియే యతఁ డాప్రాంతమువాఁడు కాఁడని నిర్ణయించు చున్నది...మఱియు సోమనాథుఁడు తొలుత గోదావరీ మండలమున దాక్షారామ నివాసి యగు మల్లికార్జున పండితుని సంప్రదాయము వాఁడు. కన్నడదేశమున ప్రసిద్ధి నొందిన బసవని వృత్తాంతమే తెలియని వాఁడు సోమనాథుఁడు. కన్నడదేశమున హాల్కురికి వాస్తవ్యుఁ డైనచో బసవని చరిత్రి నాతఁ డితరులవలన తెలిసికొన నగత్యము లేదు. అతఁడు కన్నడభాష లోనే బసవపురాణము వ్రాసియుండునుగాని, తెనుఁగుభాషలో మొదట వ్రాసియుండఁడు...ఆవెనుక కన్నడభాషలోనికి ననువదింపఁబడుటయు గూడ పాల్కుఱికి వాదమునే బలపఱచుచున్నది." 2

కులగోత్రాదులు :

సోమనాథుఁడు పాలకురికి గ్రామమున శ్రియాదేవియు, విష్ణురామిదేవుఁడు నను బ్రాహ్మణదంపతులకు జన్మించిన పుణ్యమూర్తి. ఇహపర సుఖ సిద్ధిని గోరి ద్విపదలో బసవపురాణము రచించుచు నందు తన మాతాపితరులను బేర్కొని[3]

1. "రెండు పాడ్లు ఎలకుర్కి ప్రసన్న విశ్వేశ్వర దేవరకు సమర్పించినందుల విని యోగము భోగము వారు..."...కాకతీయ రుద్రదేవుని ధర్మసాగరశాసనము.
"శ్రీచౌండ సైన్యపతి రారవీందుతారం గ్రామం సమగ్రమ ప......న్నుఅకుఱ్కి సౌంజ్ఞం..."...గణపతిదేవుని కొండిపర్తి శాసనము. శా.శ. 1136.
చూడు: బసవపురాణ పీఠిక శ్రీ బండారు తమ్మయ్యగారు. పుట. 25 - 26.

2. తెనుఁగుకవుల చరిత్ర. (మదరాసు విశ్వవిద్యాలయ ప్రచురణ. 1953)పుట.313.

3. భ్రాజిష్ణుఁ డగు విష్ణురామిదేవుండు దేజిష్ణువగు శ్రియాదేవి యమ్మయును గారవింపఁగ నొప్పు గాదిలి సుతుఁడ:", బ. పు. (సంక్షిప్తము) 1. 151-152.

ఋణవిముక్తుఁ డైనాఁడు సోమనాథుఁడు. జన్మచే నీతఁడు బ్రాహ్మణుఁ డయ్యు నూతనముగాఁ దెలుఁగునాట వ్యాప్తినొందిన వీరశైవమతమునం దనురక్తుఁడై తన్మతదీక్షను గైకొని వీరమాహేశ్వర వ్రతాచారుఁ డైనట్లు కానవచ్చుచున్నాఁడు. "పాశముక్తుండ కేవల భక్తిగోత్రుండ"నని తన కులగోత్రపాశవిముక్తిని,శైవ భక్తిపారవశ్యమును బ్రకటించు కొనినాఁడు. ఈతని కామతమునం దంతభక్తి కుదురుటకు సమీపగ్రామమునం దున్న కట్టకూరి పోతి దేవర ప్రబోధము కారణమై యుండవచ్చును. అందువలననే "ఖ్యాత సద్భక్తి మైఁగల కట్టకూరి, పోతి దేవర పదాంబుజ షట్పదుండ" నని చెప్పుకొనినాఁడు. అతనికి దీక్ష నిచ్చి దివ్య పునర్భవమును బ్రసాదించిన గురువర్యుఁడు గురు లింగార్యవరుఁడు. అటనుండి యతనికి గురువే తండ్రి. అతని కరమే జన్మస్థానము. కావుననే "శరణాగతాశ్రయ సకలస్వరూప-గురులింగవర కరోదర జాతుండ"[1]నని వినమ్రుఁడై చెప్పుకొనినాఁడు. అతని భక్త్యావేశమే యతనిలోని కవిత్వావేశమును మేల్కొల్పినది. అట్టి తరుణమున కరస్థలి విశ్వనాథయ్యగారి సాన్నిహిత్యము, శిష్యత్వము లభించుటయు నతనివలన బ్రకట పరప్రసాద కవిత్వయుతుఁ డగుటయు సంభవించినది. కవితామధు వాని సహజసంగీతశాస్త్ర పాటవముతో నాత్మభక్తి గీతములాలపించుచున్న సోమనాథుఁడు కవికోకిల యై చెన్నరాముఁడు, గోడగి త్రిపురారి మొదలగు భక్తుల సంభావనకు పాత్రుఁడై, వారికి ప్రాణస్నేహితుఁడు కాఁగలిగినాఁడు. ఆ పైన భక్తకారుణ్యాభిషిక్తుఁ డైనాఁడు. అతనియందు భక్తియు, కవితయు, మతాచారసంపత్తియుఁ బరిపక్వదశ నందుటకు పెద్దకాలము పట్టియుండదు. అంతట 'భవిజన సమాదరణ సంభాషణాది సంసర్గదూరుఁ డై నిర్మలచరిత్రుఁ' డని వాసి కెక్కెను. సహజపండితుఁడైన సోమనాథుఁడు శైవాగమధర్మశాస్త్రములను పుక్కిట పట్టి పరమ విజ్ఞాని యై వెలుఁగొంది

---

1. బ. పు. (సంక్షిప్తము.) 1. 148-149. ఇట్లు ఇట్టి గురుప్రశంస పండితారాధ్య చరిత్రమునందును గలదు: "పేరెన్నఁబడిన శ్రీబెలిదేవివేమ - నారాధ్యులను పరమారాధ్యదేవు-మనుమని శిష్యుండ''. ఇచ్చట మనుమఁ డనఁగా అచార్యవంశమున మనుమఁడని భావించి "ప్రశిష్యు"నిగా గ్రహింపవలెనని కి॥శే॥ వే. ప్రభాకరశాస్త్రి గారు బ పు. పీఠిక పు.14. 'గురులింగ'ము సంజ్ఞకాదనియు గురువనులింగమనియు శ్రీ బండారు తమ్మయ్యగారు, దీనిని శ్రీ చాగంటి శేషయ్యగారు ప్రత్యాఖ్యానించిరి. (చూడు: కవితరం. 3 సం. 95-98) అనుభవసారమున జెప్పిన గోడగి త్రిపురారి దీక్షాగురువగు గురులింగమే సోమనాథుని దీక్షాగురు వని వారు తలంచిరి.

"ధర 'సుమామాతా పితాపుత్రః' యనెడు
వర పురాణోక్తి నీశ్వరకులజుండ !"[1]

నని చెప్పికొని తన పండిన మత సంస్కారమును బసవపురాణమున నొలుక పోసినాఁడు.

సోమనాథుఁడు పుట్టుకచే బ్రాహ్మణుఁడా? జంగముఁడా? యను సంశముపై విమర్శకులలో వాదము లున్నవి. శ్రీ బండారు తమ్మయ్యగారు సోమనాథుఁడు జంగమకులజుఁ డనియు,[2] కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగా రాతఁడు శిష్టాచార సంపన్న మైన బ్రాహ్మణకులమున జన్మించినవాఁ డనియు,[3] కీ. శే. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగా రతఁడు ఆరాధ్య బ్రాహ్మణుఁడనియు, శ్రీ చాగంటి శేషయ్యగా రాతఁడు నియోగి బ్రాహ్మణుఁ[4] డనియు నభిప్రాయపడిరి. వీ రందరికిని విమర్శకులలో అనుయాయు లున్నారు.

సోమనాథుఁడు తన ప్రథమకృతి యైన అనుభవసారమున తాను

కం. "భృంగిరిటి గోత్రుఁడను[5] గురు
లింగతనూజుండ శివకులీనుఁడ దుర్వా
సంగవివర్జిత చరితుఁడ
జంగమ లింగప్రసాద సత్ప్రాణుండన్. (22 ప.)

అని చెప్పుకొనినాఁడు. ఇందు భృంగిరిటి గోత్రుఁడ నని చెప్పిన వాక్యమును బట్టి సోమనాథుఁడు పంచాచార్య సంప్రదాయమునకు సంబంధించిన భృంగిగోత్రజుఁ డైన సహజవీరశైవుఁ డనియు, జన్మచే జంగముఁడనియు, నతని తల్లిదండ్రులును జన్మచే జంగము లనియు శ్రీ తమ్మయ్యగారి వాదము. కాని, "సోమనాథుఁడు జన్మతః జంగముఁడు కాఁడని యాతని తల్లిదండ్రుల నామములే వేనోళ్ల చాటు చున్నవనియు "భృంగిరిటి గోత్రుఁడను" అనుచోట "గోత్రుఁ డగు" అని

1. చూడు: బసవపురాణము (సంక్షిప్తము) అవతారిక. 1. 145-164.
2. బసవపురాణ పీఠిక. పుటలు. 28-50 (వావిళ్ల ప్రచురణ).
3. బసవపురాణ పీఠిక. పుటలు. 8-13 (ఆంధ్ర గ్రంథమాల ప్రచురణ).
4. కవితరంగిణి. సం. 3 పుటలు. 122-136.
5. పిడుపర్తి సోమనాథుఁడు తన పద్యబసవపురాణమున:
క. భృంగిరిటి గోత్రసంభవ, జంగమ లింగార్చనా విశారద ! విలస, త్సంగీత శాస్త్ర పారగ, గంగోత్పత్తి ప్రకార కావ్య ధురీణా ! 3. 451.

యుండఁదగు ననియు, నప్పు డది సోమనాథుని గురువునకు విశేషణ మగు ననియు, దీక్షానంతరమున గురుగోత్రము శిష్యుఁడు తాల్చుట మతాచారమే యనియు తలంచి, 'ఈ పద్యమును బట్టి సోమనాథకవి కేవలము సహజ జంగముఁ డని నిర్ధారణము చేయరాదనియు, బసవపురాణ మందలి తల్లిదండ్రుల నామములను బట్టి యాతఁడు జన్మతః జంగమేతరుఁ డై భృంగిరిటి గోత్రుఁ డగు వానిచే శైవదీక్ష నంది భృంగిరిటి గోత్రుఁడ నని యనుభవసారమునఁ జెప్పుకొనె ననియు, గురులింగ హస్త తనూజాతుఁడ నని చెప్పుకొనినవాఁడు భృంగిరిటి గోత్ర సంభవుఁడ నని చెప్పుకొనుటకు సందేహింపఁడనియు నిశ్చయించుటయే యుభయ గ్రంథసమ్మత మగు ననియు"[6] విమర్శకులు భావించుచున్నారు. సోమనాథుఁ డారాధ్యబ్రాహ్మణుఁ డని నిరూపించుచు శ్రీ నిడుదవోలు వేంకటరావుగా రిట్లు రచించి యుండిరి : "సోమన తాను మాత్రము భృంగిరిటి గోత్రుఁడనని చెప్పియున్నాఁడు గాని బసవన పండితారాధ్యులకు నేగోత్రమును చెప్పలేదు. జన్మముచే బ్రాహ్మణులై నప్పుడు వారి కేదో గోత్ర వ్యవహారము తప్పదు. సోమనాథుఁడు చెప్పకపోయినను, పండితుఁడు గౌతమగోత్రుఁడని తరువాతి గ్రంథములు చెప్పుచున్నవి. పండితారాధ్య చరిత్ర శ్రోత పాల్కురికి సూరనామాత్యుఁడు హరితసగోత్రుఁ డని సోమనాథుఁడే చెప్పియునాఁడు. అట్లే సోమనాథునికి గూడ అర్షేయమగు గోత్రముండియే తీర వలయును. అతఁడు జన్మముచే బ్రాహ్మణుఁడని యంద రంగీకరించినదే కదా ! ఇక, పరంపరాయాత మగు జనశ్రుతిని బట్టి యాతఁడు కౌండిన్య గోత్రజుఁ డని తెలియవచ్చు చున్నది. మఱియు నాకాలమున జంగమ శబ్దము జాతివాచకము కాదు. శివభక్తు లేజాతివారైనను జంగములే. నన్నెచోడకవి గురువు "జంగమ మల్లికార్జునుఁడు" "భూసురకులతిలకుఁడు". పాల్కుఱికి సోమనాథుని గురు వగు బెలిదేవ వేమనారాధ్యుఁడు భూసురుఁడే యని పండితారాధ్య చరిత్రమునఁ గలదు. కావున బసవన, పండితారాధ్య, వేమనారాధ్యుల వలె సోమనాథుఁడును "భూసుర తిలకుఁడైన జంగముఁడే కాని వేరుకాదు. కులగోత్రముల ప్రసక్తిలేని వీరమాహేశ్వరాచారము స్వీకరించిన వెనుక సోమనాథుఁడు తత్సంప్రదాయము ననుసరించి తానీశ్వరకులజుఁ డనియు, భక్తి గోత్రుఁడ ననియు, పార్వతీపరమేశ్వరులు తల్లిదండ్రు లనియు, చెప్పుకొన్నాఁడు. మఱియు భృంగిరిటి గోత్రుఁడ ననియు, గురులింగతనూజుఁడ ననియు ననుభవసారమునఁ జెప్పినాఁడు... ప్రప్రథమ

1. కవితరంగిణి. సం. 3. పుట. 125, 126, 129.

గ్రంథ మగు ననుభవసారమున గురులింగతనూజుఁడ నని చెప్పిన సోమనాథుఁడు బసవపురాణమున తండ్రి విష్ణురామదేవుఁడని యేల చెప్పెనో యోజింపఁదగినది. ఇది పర్రిజాసామాన్యమున ప్రచారము గావలసినది. సోమనాథుఁ డిందు శైవమత దీక్షగొని వెనుకధరించిన నామమును చెప్పక, తనజన్మమునకు హేతుభూతులగు తలిదండ్రుల పేళ్లు చెప్పుట యాతనిలోకజ్ఞతయే కాక తలిదండ్రుల యందలి యాతని పూజ్యభావము గూడ సూచించుచున్నది. భక్తి తన్మయత్వము చేతనైన పండితారాధ్య చరిత్రమున "మును బసవపురాణమున నెన్నఁబడిన పెనుపారు భక్తుల పెంపుడు కొడుక" అని వారిని స్మరించియే యున్నాఁడు. కాబట్టి సోమనాథుఁ డారాధ్య బ్రాహ్మణుఁ డని యంగీకరించుట సమంజసము"·[1]

మఱియు 'పండితారాధ్య చరిత్రము, చతుర్వేదసారము, బసవరాజీయము మొదలగు గ్రంథములు పరిశీలించినచో వానియందు వేదమంత్ర భాష్యము లుదాహృతమై యుండుటచేతను, వైశ్వదేవాది శ్రౌతకర్మల రహస్యము లెన్నియో విమర్శింపఁబడుటచేతను, "చతుర్వేద పారగుఁడ" నని సోమనాథుఁడే పండితారాధ్య చరిత్రమునఁ జెప్పుకొనుటచేతను, బ్రాహ్మణేతరుడు వేదము చదువరాదను ప్రమాణములను సోమనాథభాష్యమున నుదాహరించుటచేతను, పలువురు కర్ణాటాంధ్ర కవులు సోమనాథుని నారాధ్యనామముతో బేర్కొనియుండుట చేతను,[2] శైవులైన బ్రాహ్మణులకే యా నామము చెల్లుచుండుటచేతను, సోమనాథుని బ్రాహ్మణత్వము నిర్వికల్పముగా నిలువగల' దని ప్రభాకరశాస్త్రిగారు స్థాపించినారు.[3]

మహిమలు :

బసవపురాణ రచనముతో సోమనాథుని మతదీక్షతోపాటు, కవితాదీక్షయు పండబారినది. ఆతఁడు పురాణనిర్మాణదక్షుఁ డగుటచే నవ్యవ్యాసుఁడుగా వాసికెక్కినాఁడు.

---

1. తెనుఁగు కవుల చరిత్ర. (మ. వి. ప్ర.) పుట 324-325.
   డా. చిలుకూరి నారాయణరావుగారు సోమనాథుఁడు శివబ్రాహ్మణుఁడనియే భావించిరి.
   చూడు: పండితారాధ్యచరిత్ర పీఠిక. పుట. 80-85.

2. ఉదాహరణమునకు పిడుపర్తి సోమనాథుని బసవపురాణాశ్వాసారంభ పద్యములను గమనించునది.

3. బసవపురాణము. పీఠిక పుటలు 8-13·

క. "బసవేశ్వర ముఖ్య ప్రమథ
ప్రసృమర మాహాత్మ్యయుక్త బసవపురాణా
ద్యసమ శ్రీగంధ నిబం
ధ సమంజస వాగ్విలాస ! నవ్యవ్యాసా !" 1

అని పిడుపర్తి సోమనాథుఁడు కీర్తించియుండుట దానికి సాక్ష్యము. అంతియకాదు. సోమనాథుఁడు "పరమతనిర్ధూమధామ భాసురపతి" యనియు. వాదిజైత్రాగ్రగణ్యుఁడనియు "సారవీరవ్రతాచారపారంగతుఁ"డనియు చతుర్నిగమ సారవాక్సూక్తియుక్త సత్కావ్యనిర్మిత ప్రణవశిష్యకామిత విశిష్టముక్తిప్రదుఁ" డనియు, రసనాగ్రస్థానకృత్యత్ప్రవిమల శివశాస్త్రస్థితాశేష గోప్యార్థ ... వచన సంధాన నైపుణ్య' భాసితుం డనియు, 'యతి' యనియు, 'సుజ్ఞాని' యనియు, 'సమహిత మహిమాఢ్యుఁ' డనియుఁ గీర్తింపఁబడెను. 2 పిడుపర్తి సోమనాథుఁడు పాల్కురికి సోమనాథుని కవిత్వమహిమను, శివవ్రతాచార మహిమను వికాసక్రమమున నాశ్వాసాద్యంత పద్యములందు వర్ణించి యాతని పరిపూర్ణజ్ఞాన స్వరూపమును సప్తమాశ్వాసమున "పరిపూర్ణానందమూర్తి ! భరిత దశదిశా ప్రాంత విశ్రాంతకీర్తీ !" 3 అని సంబోధించుటలో వ్యంజించెను.

ఇట్టి మహనీయవ్యక్తి యొక్క మహిమలు తెలుపు నద్భుతకథ లనేకము లున్నవి. అవియన్నియుఁ జరిత్రకారులు నమ్మకపోయినను అతని కాలనిర్ణయమున కుపకరించు పూర్వోక్తైతిహ్యమును మాత్రము విశ్వసించుచున్నారు. అట్లు విప్రుని వాక్యములు విని యచ్చటి శైవభక్తులు చెవులను చేతులతో మూసికొని యా బాపని వధింప నుంకించియుఁ బాల్కురికిలో నున్న సోమనాథున కెఱింగింప నేఁగిరి. సోమనాథుఁడు వారి మాటలు విని భవులతో వాదము చేసి గెలువఁదలంచి, భవిపర్శన వివర్జన దీక్షితుఁడుగాన తృణ మానవునితో వాదు గెలిపింతు నని ప్రతిజ్ఞచేసి, లింగముద్రలుగల యెడ్లు పూన్చిన గుడారుబండి నెక్కి యోరుగల్లుకు పయన మయ్యెను. అతనిరాక నోరుగల్లులోని భవు లెఱింగి యల్లరిమూకకు లింగముద్రలు తగిలించి యతని కెదురు పంపిరి. వారు సోమేశ్వరుని కెదురేగి మ్రొక్కనంతనే యతని మహిమవలన వారు ధరించియున్న కృతకలింగ చిహ్నములు సహజములై పోయెను. అంత వా రామహిమ కచ్చెరువంది సోమ నాథుని శిష్యులై పోయిరి. ఇట్లు మహిమలు ప్రదర్శించుచు నోరుగంటి కోట వాకిటఁ బ్రవేశించు నవసరమున గవనిపై గజలక్ష్మి విగ్రహము గాంచి యెడ్లు

1. పిడుపర్తి సోమన బ. పు. 1.156.
2. పిడుపర్తిసోమన బసవపురాణము పీ. 79. 4.322; 2.213, 3.452; 4.320; పీ. 79, 82; 6.373;
3. పి. సో. బ. పు. 7.388.

ముందు కడుగుపేయ వయ్యెను. సోమనాథుఁ డది యెఱింగి లక్ష్మని 'తొలఁగు' మని యానతిచ్చెను. అంత నా విగ్రహము తునియ లై నేలఁబడెను. ప్రతాపుఁ డది యెఱింగి భయపడి విప్రులతోఁ గూడివచ్చి సోమనాథునికి మ్రొక్కెను. అతఁడు వారలను దయాదృష్టితోఁ గాంచి, శివభక్తుల సమాదరణము పొంది యచ్చట కొన్నిదినము లుండెను. అంత త్రికాలవేది యగు సోమనాథుఁడు పిడుపర్తి శివరాత్రికొప్పయ్య మొదలగు శివభక్తులను జేరఁబిలిచి "ఈ దేశం బింకఁ దురుష్కులచే నాక్రాంతము గాఁగలదు; మాబోటి మతస్థులకిం దునికి పొందువడ దని చెప్పించి," ప్రతాపుని మంత్రియు తనశిష్యుఁడు నైన ఇందుటూరి అన్న యను బిలువఁబంచి, శివమతస్థులకు దోకిపట్టుగ్రామము నగ్రహారముగా నిప్పించెను. అందు భక్తులతోఁగూడి కొన్నాళ్లు సోమనాథుఁడుండి, వార్ధకము గదియ వచ్చె ననియు, సమాధిగతుఁడు కావలె ననియు తలంచి కల్యాణపురి కేఁగి, అందు విభూతితో నింపిన గర్తమున సమాధిగతుఁ డై, భక్తులు చూచుచుండ ప్రత్యక్ష శివాకృతిలో లింగైక్య మందెను.[1]

కాలము :

పాల్కురికి సోమనాథకవి ప్రథమ ప్రతాపరుద్రుని కాలమున నున్న వాఁడని కొందఱును,[2] రెండవప్రతాపరుద్రుని కాలమున నున్నాడని కొంద ఱును[3] భావించుచున్నారు. ఇట్లు భావించుటకు పైఁ బేర్కొనఁబడిన యైతిహ్యమునఁగల ప్రతాపప్రశంసయే ముఖ్యకారణము. ఒక విధముగా సోమనాథుని కాలవాదచక్రము ప్రతాపరుద్రుఁడను కేంద్రము నాధారముగాఁగొని పరిభ్రమించు

1. చూడు: పిడుపర్తి సోమనాథుని పద్య బసవపురాణము. పీఠిక ప. 28-46. పాల్కురికి సోమేశ్వర పురాణాదులలో నున్నకథలను గూర్చి కీ. శే. వే. ప్రభాకర శాస్త్రిలవారి పీఠికలో పు. 22-26. చూచుకొనునది.

2. క్రీ. శ. 1190 ప్రాంతము వాఁడని వేటూరి ప్రభాకర శాస్త్రిగారు; 1190-1260-70 నడుమ నున్నవాఁడని నిడుదవోలు వేంకటరావుగారు. 1160-1240 నడుమ నుండె నని బండారు తమ్మయ్యగారు :

3. బసవపురాణ, పండితారాధ్య చరిత్రల రచనాకాలము క్రి. శ. 1-90-1320 మధ్య నుండునని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ; 1240 తరువాతి వాఁడని చిలుకూరి నారాయణరావుగారు; క్రీ. శ. 1240-1320 నడిమివాడని చాగంటి శేషయ్యగారు.

చున్నది. మొదటి ప్రతాపరుద్రుని (క్రీ. శ. 1185_1195) కాలమున నున్నవాఁడనువారు పైకథలోని ప్రతాపరుద్రునామ సంబంధము తప్ప నితరాంశముల నన్నింటిని ప్రమాణములుగా గ్రహింపరు. పాల్కురికి సోమనాథునకును పిడుపర్తి సోమనాథునకును కాలాంతర మధిక మగుటచే నీతని మాటలలో సత్యదూరము లైన పుక్కిడిపురాణములు చేరియుండవచ్చు నని భావించి పాల్కురికి వాని గ్రంథాంతర సాక్ష్యములు, అతని సమకాలీనుల రచనలు, కర్ణాట కవి చరిత్రకారుల రచనలు మొదలగువానిని ప్రధానసాక్ష్యములుగా గైకొని కాలనిర్ణయము చేసెదరు. రెండవపక్షమువారు ప్రతాపునికాలమందును (క్రీ.శ.1295_1326) పిడుపర్తి సోమనాథుని వాక్యము లందును ప్రమాణబుద్ధి నుంచి సోమనాథుని కావ్యాంతర సాక్ష్యములను, ఇందుటూరి అన్నయామాత్యుఁడు దోకుపల్లి దాన మిప్పించిన వృత్తాంతమును సమన్వయించి కాలనిర్ణయము చేసెదరు.

మొదటి పక్షమువారి ప్రధాన వాద ప్రమాణములలో నొకటి సోమరాజను కర్ణాట కవి రచించిన యుద్భట కావ్యమునఁ బేర్కొనఁ బడిన యీ క్రింది పద్యము.

మ. ప్రమథానీకకథార్ణవేందు హరిదేవాచార్యనం ధైర్యనం
సముదంచద్వృషభస్తవామర మహీజారామనం సోమనం
విమలజ్ఞాన సుదీపికాస్ఫురితచేతస్సద్మనం పద్మనం
క్రమదిందం బలగొండు పేళ్వెనా సెదా నీ కావ్యమం సేవ్యమం.

ఇందు వృషభస్తవ మొనర్చిన కవిగా స్తుతింపబడిన సోమనయే పాల్కురికి సోమనాథుఁ డని వీరి విశ్వాసము. సోమరాజకవి తన రచనా కాలము నీ క్రింది విధముగాఁ బేర్కొనినాఁడు.

మ. జననాథోత్తమ సోమరా జను సిద్ధి కావ్యం వలం శాలివా
హన శాకాబ్దమదెయ్దె సాసి రదనూఱిం సంద నాల్వత్తు నా
ల్కనె యారంజిత చిత్రభానువ వరాశ్వీజోల్పి తైకాదశీ
వనజారాతితనూజవాసర దొ ళాదత్తల్ల మంగర్పితం.

ఇందలి "నూఱింసందనాల్వత్తు నాల్కనె" అను మాటలను బట్టి సోమరాజుకవి శ. 1144 (క్రీ.శ.1222) సం॥ ప్రాంతమువాఁ డని తెలియుచున్నది. కావున నతనిచేఁ బ్రశంసింపఁబడిన సోమనాథుఁడు నంతకుఁ బూర్వమే బసవ పురాణము రచించియుండనోపు నని భావించిరి. కాని "నూఱిన్ సంద" అనుపాఠ

మొక ప్రతియందు మాత్రమే కలదనియుఁ బెక్కు ప్రతులలో "నానూత్సంద" యని యున్నదనియు కీ. శే. వా. చిలుకూరి నారాయణరావుగారు తెల్పి యున్నారు.1 1144, 1444 ఈ రెండు సం॥లును చిత్రభానులే కాని ఆశ్వయుజ శుద్ధ ఏకాదశి – బుధవార మగుట 1444 సం॥ననే పొసగుచున్నది. కావున వారి వాదమును బట్టి సోమరాజు శ. 1444 అనఁగా క్రీ.శ. 1522 ప్రాంతమువాఁ డగుచున్నాఁడు. అప్పుడు కన్నడ సోమరాజకవి మనకెంత విశ్వాసార్హుఁడో పిడుపర్తి సోమనాథుఁడు నంతే యగుచున్నాఁడు.

పై పక్షము వారి వాదమున గానవచ్చు ముఖ్యాంశములు మూఁ డని శ్రీ చాగంటి శేషయ్యగారు పేర్కొనియుండిరి. అవి: (1) బెలిదేవ వేమనా రాధ్యుని మనుమని శిష్యత్వకథ. (2) మల్లికార్జున పండితారాధ్యుల వంశ పరం పరగాథ. (3) కరస్థలము సోమనాథయ్యకథ. వీనిని సవిమర్శముగా శ్రీ శేషయ్య గారు పరిశీలించి సోమనాథుని కాలమునకు సమన్వయించిరి. సోమనాథుఁడు క్రీ.శ. 1240 – 1320 సం॥ మధ్యకాలమున నుండియుండవచ్చు నని వారు నిర్వహించిన వాదము[2] యుక్తియుక్త మని నాకుఁ దోచినది. ఓరుగల్లులో ఈశ్వరాలయమున బసవపురాణ శ్రవణము, సోమనాథుఁడు తనశిష్యుఁడైన ఇందు టూరి అన్నయామాత్యుని చేత చెప్పించి పిడుపర్తి శివరాత్రి కొప్పయ్యకు డోకిపఱ్ఱు నగ్రహారముగా నిప్పించుటయు నొకే ప్రతాపరుద్రుని కాలమున జరిగియుండుట నిర్వివాదాంశ మనియు, అన్నయామాత్యుఁడు రెండవ ప్రతాప రుద్రుని పినతల్లియైన రుయ్యాంబయొక్క భర్త యగుటచే ప్రతాపుఁ డనఁగా రెండవ ప్రతాపరుద్రుఁడే యనియు, అందులకు శాసనాధారము లున్న వనియు, డోకిపఱ్ఱు దానకథ అసత్య మనుటకు వీలులే దనియు, అగ్రహారము వడసిన వంశీయులలోని వాఁడగు పిడుపర్తి సోమనాథుని వ్రాతలు సత్యములని గ్రహించుట యుక్తమనియు అందు శివరాత్రి కొప్పయ్య వంశమువాఁడైన పెదసోమయ్య తన తాత సంపా దించిన యగ్రహారమున కభ్యంతర మేర్పడఁగా ప్రౌఢదేవరాయల (రెండవ దేవరాయలు క్రీ.శ. 1419–1449) నాశ్రయించి డొకిపఱ్ఱు నతనిచే మఱల పొందె నను కథ ద్వితీయప్రతాపరుద్ర కాలవాదమున కనువుగా నున్న దనియు, సోమనాథుఁడు ప్రథమ ప్రతాపరుద్రుని కాలమున నున్నచో బసవపురాణమున

1. పండితారాధ్యచరిత్ర పీఠిక. పుట 8–11.

2. ఆంధ్ర కవి తరంగిణి సం. 3. పుట 136–154.

వర్ణించిన యేకాంతరామయ్య యతని సమకాలీనుఁ డగు ననియుఁ బేర్కొనుచు నిట్లు నిశ్చయించిరి :

"సోమనాథుని కాలము వెనుకకు నెట్టవలయు నని ప్రయత్నించిన వారుకూడఁ బ్రతాపరుద్రుని వదలిపెట్టలేకున్నారు. దానికిఁ గారణ మీ కథలయందు వారికిఁగూడ నమ్మక ముండుటయే. లేకున్న సోమనాథుని కాలనిర్ణయమునకుఁ బ్రతాపరుద్ర మహారాజెందులకు? పైనఁ జెప్పిన మూడుకథలు తప్ప ప్రతాపరుద్రునితో సోమనాథునకు సంబంధమును గలుపు కథ లేవియును లేవు. పైనఁ జెప్పిన గాథలను నమ్మి, కర్ణాటకవి చారిత్రమునందలి కథను సత్య మని భ్రమించి, సోమనాథుని బ్రతాపరుద్రుని కాలములోని వాఁ డనుకొని చరిత్రకారు లందుల కనువుగ నుండునట్లు బెలిదేవ వేమనారాధ్యులతో సంబంధించిన కథల నెట్లో సరిపెట్ట యత్నించుటచే నీ వివాదము పెద్ద దయినది. సోమనాథునకు దాదాపు 150 సం॥ కాలములో నుండి సోమనాథుని ద్విపద బసవ పురాణమును బద్య బసవ పురాణముగా రచించి యీ గ్రంథమును సోమనాథునికే కృతి యిచ్చినట్టియు, సోమనాథుని శిష్యుఁ డైన కొప్పయ్యకు మనుమని మనుమని కుమారుఁ డైనట్టియు, పిడుపర్తి సోమనాథకవి చెప్పిన వాక్యములందు మనము గౌరవ ముంచితిమేని, సోమనాథుఁడు ద్వితీయ ప్రతాపరుద్రుని కాలములోనివాఁ డని యనకతీరదు". 1

చారిత్రకపురుషుఁ డై, మతప్రవర్తకుఁ డై వీరశైవభక్తులకు పరమేశ్వరకల్పుఁ డైన బసవేశ్వరుని చరిత్రము ప్రత్యక్షప్రమాణప్రతిపత్తి నుండి, ఐతిహాసికకథాకథనస్థాయి కెక్కి, పురాణకల్పనామహనీయవియన్మండల మందుకొని, సోముని కవితాసుధామందిర మగుట కొక శతాబ్దము పట్టినది. పట్టుట సహజము కూడ! నందీశ్వరావతార మని బసవేశ్వరుని కీర్తించి యతనిని పురాణవ్యక్తిగా నిరూపించి నవ్యవ్యాసుఁ డని వాసికెక్కిన సోమనాథుని బసవ పురాణము దేశిచ్ఛందమునఁబడి జనావళి నాకర్షించినను, పండితావళి ప్రమాణబుద్ధుల కెక్కకపోవుటచే కాబోలు దానినే మారనాదుల పురాణరచనామార్గము ననుసరించి గద్యపద్యాత్మకముగా రచింపఁ బూనుకొనిన పిడుపర్తి సోమనాథునకు పురాణకర్త యగు సోమనాథుని పురాణవ్యక్తిగా మార్చుటకు మఱి యొకటిన్నర శతాబ్దము పట్టినది. అప్పటికి సోమనాథుఁడు – నందీశ్వరుఁ డగు బసవేశ్వరుని మతమును పునరుద్ధరించుట కవతరించిన భృంగీశ్వరుఁడు. 2 అతీత భూతార్థ మితిహాస 3 మగునప్పుడు చిరభూతార్థముకదా పురాణమై పుట్టునది!

---

1. ఆంధ్ర కవి తరంగిణి సం. 3. పుట. 153, 152.
2. పిడుపర్తి సోమనాథుని బసవపురాణము. పీఠిక. పద్య. 23, 45.
   క్రీ. శ. 1560 ప్రాంతమున తోంటద సిద్ధలింగకవి కన్నడమున పాలకురికి సోమేశ్వర పురాణమే రచించెను.
3. భోజుని సరస్వతీ కంఠాభరణము: "అతీతార్థ ప్రాధాన్యా దితిహాసః" 2–368.

సోమనాథుని కృతులు :

సోమనాథుఁడు మతోద్ధరణకై తన కవిశక్తిని వినియోగించిన కవిశేఖరుఁడు. అతఁ డెంత భక్తకవియో అంత పండితకవి. వీరశైవమతోద్ధరణ కతని బసవభక్తి యెంత సహకారి యైనదో అతని పాండిత్య మంత యవసరమైనది. ఎట్లన: బసవేశ్వరుఁడు భక్తి ప్రధానమైన వీరశైవమును కర్ణాటక దేశమున వ్యాప్తిఁ జేసినాఁడు. అం దతఁడు భక్తిగీత సాహిత్యమును సృష్టించినాఁడు. పెక్కుమంది భక్తు లామార్గము ననుసరించి యా మత ప్రచారము చేయ మొదలిడిరి. కాని కాలము గడచినకొలఁది బసవనినాఁటి జిగి కాని బిగి కాని కర్ణాటమునసనే కానరాలేదు. అట్లుండ ఆంధ్రదేశము మాటయేమి? ఇచ్చట వేంగీప్రాంతములందు వైదికము పునర్విజృంభణము చేసినది. భారతము వెలసినది. రాజసభలలో, పండితపరిషత్తులలో వాదసదస్సులలో వైదికమతము పరమతములను తన పాదాక్రాంతముల నొనర్చుకొనుచున్నది. ఇట్టి తరుణమున పండితారాధ్యాదు లాంధ్రమున బ్రాహ్మ్యమును వీడక, వేదపారగత్వమును భజించి శైవమునకు వేదపురాణేతిహాసశాస్త్ర ప్రమాణవాదబలమును సిద్ధపఱచు పండితమార్గముఁ దీర్చిదిద్దియున్నారు. మతము బ్రతుకవలె నన్నచోఁ బ్రజల మనస్సు లందును బుద్ధు లందును విశ్వాసము పడయవలెను. సంఘ మనస్స్థానీయు లైన సామాన్య ప్రజ భక్తికి వశ మై, మహిమలకు ముగ్ధ మై విశ్వాసమును బెంచుకొనవచ్చును. కాని సంఘబుద్ధిస్థానీయ మైన మేధావివర్గము మాత్రము కర్కశతర్క పరీక్షలకు నెగ్గి, బుద్ధి వికాసము నిచ్చెడి జ్ఞానమతమునే గౌరవించుచుండును. వారికి భక్తి ప్రథమసోపానము; జ్ఞానము ఉత్తమసోపానము. భక్తితో ప్రజల నాకర్షించిన వీరశైవము పండితుల నాశ్రయించి జ్ఞానపుష్టిని గాంచు పద్ధతి తెలుఁగునాట వ్యాపించినది. దాని కాలంబన మైనదే ఆరాధ్య సంప్రదాయము. ఇది బసవేశ్వరుని వెన్నంటి పరమేశ్వరుని సన్నిధానమున కేఁగిన పండితారాధ్యుల తరువాత నాంధ్రమునఁ గొంత మందగించినది. దానికి తిక్కన సోమయాజి వైదికనిష్ఠ మగుమహాకవిత్వోద్యమము, ఓరుగల్లున నతఁడు సాధించిన మతవిజయము మొదలగునవి బలమైన కారణములు. యథావాక్కుల అన్నమయ్య వంటి కవులు కొందఱు గొంతెత్తి శైవకవిత్వ మాలపించినను మతమునకు బలము చాలలేదు. దానితో నటు పండితులలో నిటు పామరులలో వీరశైవము నిలువఁద్రొక్కుకొనునట్లు చేయవలసిన భారము సోమునిపైఁ బడినది. అతఁడు భక్తి కవితచేఁ

ప్రజలను పరవశింపఁ జేయఁగలఁడు; పాండితీమండితము లైన రచనలచే పండితుల చిత్తములు పట్టగలఁడు. మెత్తగాఁ జెప్పవలసివచ్చినప్పుడు నాల్కను వత్తిగాఁ జేసి మతమార్గమున తేటమాటల వెలుఁగులు నింపఁగలఁడు. పరమతముల నొత్తవలసి వచ్చినప్పుడు డానాల్కనే కత్తిగా వాడి ప్రౌఢోక్తులతో పరసిద్ధాంతఖండనము గావింపఁగలఁడు. ఆకాలమున నా మతము బ్రతుకుట కతఁడు కావలసివచ్చెను. అతఁ డామతముకొఱకే తన కలమును, కాలమును అంకితము చేసెను.

ఆరాధ్య సంప్రదాయము నాకళించుకొనిన యువసోమనాథునకు – "ఏక ఏవరుద్రో న ద్వితీయాయతస్థే" ఇత్యాది శ్రుతివాక్యముల నన్వయించి శివతత్త్వసార గద్య పద్య సమితిని నిర్మించి శివమహిమను లోకమునఁ జాటిన – మల్లికార్జునపండితుఁడే మనస్సున తత్త్వగురులింగ మై శివానుభవమును ప్రసాదించినాఁడు. ఆ అనుభవసారమే సోమనాథుని ప్రథమకృతి "అనుభవసారము." అందాతఁడు త్రికరణశుద్ధిగా పండితారాధ్యులను గీర్తించుచున్నట్లు మూఁడు సీసపద్యములలో నతనిని వర్ణించెను. (7–9) మఱియు–

క. అనుభవసారం బనఁగా
మనసిజహరు శుద్ధభక్తి మార్గము వేదో
క్తనిరూఢిఁ బురాణ రహ
స్యనియుక్తిని విస్తరింతు నది యెట్లనినన్"– (30)

అని పండితారాధ్య మార్గమును పునరుద్ధరించెను. ఇట్టి పవిత్రకార్యము నతఁడు కావ్యరూపముగా నావిష్కరించుటకుఁ దగిన కవితాశక్తినిఁ బ్రసాదించి ప్రోత్సహించిన కవితాగురువు కరస్థలము విశ్వనాథయ్య. అతనియెడఁ గల గురుభక్తిని కావ్యమునఁ బ్రదర్శించి సోముఁడు కృతకృత్యుఁడైనాఁడు. (33–34). గోడగిత్రిపురారి యీకృతికి నొడయఁడు (25). అతఁడు బహుశః సోమనాథునకు శివతత్త్వసారాది శైవమతగ్రంథ సంప్రదాయ రహస్యములను విప్పిచెప్పిన విజ్ఞాని యగుటచే నాతని కాతఁడు కృతిసమర్పణ మొనర్చియుండును.

ఇది 243 పద్యముల లఘుకృతి. గురుభక్తిమహిమ, గురులింగ జంగమ శరణ ప్రసాదభక్తస్థలములు మొదలగు శైవమత సంబంధాంశము లిందు వర్ణింపఁబడినవి. ఇందు కందపద్యము లధికముగా నున్నను, సామాన్య వృత్తములతోపాటు త్రిభంగి, క్రౌంచపదము, తరువోజ, వనమయూరము మొదలగు

విశేషవృత్తములు కూడ వాడఁబడినవి. త్రిభంగిని కావ్యమున వాడిన తెలుఁగు కవి ఈతఁడేనేమో! ఈతని యీ కావ్యనిర్మాణ పద్ధతి కన్నడ 'చత్తాణ' కావ్యమర్యాద ననుసరించుచున్న దనవచ్చును.1 ఇతఁడు చతుర్విధ కందము లను చిత్రకవిత్వ రచనమందును, ద్విత్రిప్రాసల ప్రయోగమునందును, అనుప్రాసాది శబ్దాలంకారములఁ గూర్చుటయందును మక్కువ యెక్కువగా నిందుఁ జూపించెను. సమతగల సీసపద్యరచనమును, ప్రథమదళమున యతిపాటించిన క్రౌంచపద వృత్తరచనము నీతని ప్రత్యేకత.

ఇందు సోమనాథుఁడు బసవనిఁ దలంపలేదు. అతని మహిమ లీతని చెవుల నప్పటి కింకను పడలేదు కాఁబోలు. కాని బసవనిభక్తి బీజములు నాటఁబడుటకను వైన యుత్తమ తత్త్వసంస్కార మితని చిత్తమున కబ్బినది.

ఉ. ఏపున శుద్ధ భక్తి రతి నేద్తైఱ నూల్కొన నేకలింగ ని
ష్ఠాపర యుక్తి నివ్వటిల సజ్జనభావము పొంగలింప ను
ద్దీపిత తత్త్వదృష్టి మతిఁ దేజ మెలర్పఁగ సచ్చరిత్రయం
దోపి వెలుంగు భక్తుఁడు మహోన్నతి నుండు జగజ్జనాశ్రయా! (167)

అనెడి యాతని వాక్కున నా సంస్కారము గుబాళించుచున్నది. ఇట్టి తత్త్వదృష్టి పండితారాధ్య సాహిత్యరససిద్ధిచే నాతఁడు సాధించిన శివానంద పదసిద్ధి.

ఇట్టి యనుభవసారముతో నాతఁడు శివభక్తగణ సందర్శనార్థము దేశసంచారము చేసియుండును. భక్తకూట మగు శ్రీశైలకూట మతని చిత్తౌన్నత్యమును గుర్తించి బసవనిభక్తిని అందు ప్రతిష్ఠాపించెను. అతని కప్పు డది యొక నూతనానుభవసార మైనది. అనుభవసారము నాటికే అతఁడు—

శా. "వ్రాలున్ వ్రాలు శివార్చనాపరవశవ్యాప్తిన్ బ్రమోదంబునన్
గ్రాలున్ గ్రాలు నహర్నిశంబు శివలింగధ్యాన సంపన్నుఁడై
సోలున్ సోలు నపారసార వివిధ స్తోత్రప్రలాపంబులన్
దేలున్ దేలు మహానుభావసుఖవార్ధిం భక్తుఁ డుద్యద్గుణా!" (166)

అని చెప్పఁగలిగిన అనుభూతి గలవాఁడు. ఆపైన బసవభక్త్యనుభూతి క్రొత్తరుచుల నిచ్చుటచే నాతఁ డంత భక్తి పారవశ్యము నందును బ్రకటించినాఁడు. పండితుని మార్గముకన్న ప్రాచీన మైన బసవనిమార్గము పురాణమార్గముగా

1. కవిరాజమార్గము. 1.34, 35 చూడు: (భాషాసారస్వతములు దేశి: శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు. పుట 126).

నతని చిత్తమున హత్తుకొనినది. అట్టి చిత్తము బసవపురాణ రచనాయత్త మైనది.

బసవపురాణము బసవని విశుద్ధభక్తి మార్గమును ప్రతిపాదించుట కేర్పడిన ప్రప్రథమ వీరశైవపురాణము. దానిని భక్తులు పాడుకొనవలె ననియు, పామరులు పురాణశ్రవణము చేయవలె ననియు, జనులహృదయములు భక్త చరిత్రముల కార్ద్రము లై బసవని భక్తిబీజములకు ఫలక్షేత్రములు కావలె ననియు రచించెను. అందువలననే అది సర్వసామాన్య మైన జానుఁదెనుఁగున జాలువారినది. దాని ప్రయోజన మది అనతికాలములోనే సాధించినది. ఆంధ్ర కర్ణాట దేశము లా పురాణమును పూవులలోఁ బెట్టి పూజించినవి; పుక్కిటఁ బట్టి కీర్తించినవి. ఇంతటి పురాణము రచించిన భక్త సోమనాథుఁడు బసవ కీర్తనమునఁ దృప్తిపడలేదు.

"ఇదియుఁ గోటికిఁ బడగెత్తిన వానిఁ
బదివేల కాపవై బ్రదుకు మన్నట్టు
లాపరంజ్యోతిస్స్వరూపంబునకును
దీపకంభంబు లెత్తించినయట్లు
భవనిర్మితము లైన పత్రపుష్పములు
భవునకుఁ దగ సమర్పణ సేయునట్లు
గాక కీర్తింపఁగా నాకుఁ దరంబె
ప్రాకటంబుగ భక్త బందారి చరిత!" (ప్ర. 243-250)

అని బసవపురాణానంతరము కూడ బసవగుణమతకీర్తనాత్మకము లైన కృతుల నాతఁడు రచించుట మానలేదు. పుంఖానుపుంఖముగా నతని కలమునుండి బహువిధ సాహిత్య ప్రక్రియలు లాస్యముచేయుచు లోకమున కవతరించినవి.

సోమనాథుఁడు నిర్మించిన భక్తిసాహిత్యమున నొక విశిష్ట లక్షణము కానవచ్చుచున్నది. అది యాతని వ్యక్తిత్వమును గొంతవఱకు వ్యక్తీకరింపఁ జేయుచున్నది. అతఁడు వస్తుతః కవి. అందువలన నిరంకుశుఁడు; ఆవేశ పరుఁడు. ఆపైన భక్తుఁడు. అందుచే నతఁడు కవిత్వమును శివార్పితము, బసవార్పితము చేసెను. అతఁ డుద్దండ పండితుఁడు. అందువలన వాదములు చేసెను. వివిధ భాషలయందు, వివిధచ్ఛందములయందు, వేదవేదాంగములయందు అతఁ డార్జించిన పాండిత్యమును బహువిధ సారస్వత గ్రంథములుగా నాతఁడు నిర్మిం

చెను. అతఁడు భక్తుఁ డగుటచే జంగమలింగరూపు లగు భక్తులు కోరినప్పుడు లోకహితార్థమై సర్వసామాన్య మగు ద్విపదలో కావ్యము నిర్మించెను. లేనిచో నతని యిచ్చకువచ్చిన ఛందములలో నిచ్చవచ్చిన విధముగా భక్తికృతులు లిఖించు కొనెను. భక్తికృతులతో నాగక శాస్త్రవాఙ్మయమును గూడ నిర్మించి మతము నకుఁ బుష్టి చేకూర్చెను. శ్రీశైలమున భక్తుల యాదేశానుసారము సోమనాథుఁడు రెండు బృహద్గ్రంథములను నిర్మించెను. ఒకటి పురాణము. మఱియొకటి చరిత్రము. ఒకటి భక్తి సోపానము. మఱియొకటి జ్ఞానసోపానము. ఒకటి భక్తిరసతరంగిణి. మఱియొకటి మతశాస్త్రవిజ్ఞానమహాంబుధి. ఈ యుభయరస జగత్తుల నడుమ పూఁదోటలుగా, వనజాకరములుగా, గిరిశృంగములుగాఁ గన వచ్చు భక్తికృతులు కొన్ని కలవు.1 అవి ప్రధానముగా గద్యలు, రగడలు, ఉదాహరణములు, అష్టకపంచకములు, స్తవములు, శతకములు, భాష్యములు.

1. గద్యలలో పంచప్రకారగద్యయు, నమస్కారగద్యయు, అక్షరాంకగద్యయు, అష్టోత్తరశతనామగద్యయు, ముఖ్యములైనవి. చిత్తసమాహితార్థమును, అక్షరమాలారూపుఁడైన భగవంతుని స్తుతించుటకు నుద్దేశింపఁబడి నామకీర్తనైక లక్షణవిశిష్టములై, ఆంధ్రగీర్వాణ కర్ణాటచ్ఛంద సంప్రదాయముల ననుసరించి మాత్రాగణబద్ధములై విలక్షణముగా నిర్మింపఁబడిన కృతు లివ్వి. అక్షరాంకగద్యమున అక్షరాంక పద్యమును సోముఁడు రచించెను. అందచ్చులతోఁ గూర్చిన యొక పద్యము గమనింపుడు ;

చ. "అమితయశస్క ఆద్యయన ఇద్రుచి ఈశ్వర ఉగ్ర ఊర్జిత
క్రమ ఋషభాంక ౠజహార ఌప్తిత ౡాస్మిత ఏకరుద్ర ఐం
ద్రమహిత రూప ఓమితి పదద్యుతి ఔర్వలలాట అంబికా
సమరసభావ అఃకలిత వర్ణనుతం బసవేశ పాహిమాం॥ "

ఇట్లే కకారాది క్షకారాంతము గల యొక్కొక్క యక్షరమున కొక్కొక్క పద్యముచొప్పున నిందు కూర్చుట యొక భక్తివిశేషము.

2. రగడలలో బసవరగడ, బసవాఢ్య రగడ, సద్గురురగడ, గంగోత్పత్తి రగడ యనునవి – తెనుఁగుకృతులలో కర్ణాటకకృతులలో స్పష్టముగాఁ జెప్పఁజాలని రచనలు – కలవు.

---

1. విశేషములకు శ్రీ బండారు తమ్మయ్యగారి 'పాలకురికి సోమనాథకవి' యను గ్రంథమును జూచునది.

3. సోమనాథుఁడు రచించిన సంస్కృతాంధ్ర బసవోదాహరణములు ప్రసిద్ధములై తత్సాహిత్యశాఖకవి ప్రథమము లై యాచార్యపీఠములుగా రాజిల్లుచున్నవి. విశిష్ట భక్తిస్ఫోరకము లగునట్లు విభక్తి ప్రత్యయములకు ప్రాధాన్య మిచ్చి నిర్మించు విచిత్ర భక్తికావ్య ముదాహరణకావ్యము. పద్యము, కళిక, ఉత్కళిక – అను వానిని క్రమముగా నొక్కొక్క విభక్తి యందును రచించి, సార్వవిభక్తిక శ్లోకము (సం) (పద్యము–తెలుఁగు) తోడను, అంకితాంక శ్లోకముతోడను నాయకునిఁ గీర్తించు లఘుకృతు లివ్వి. విద్యానాథుఁడితని సంస్కృత బసవోదాహరణమునే తన ప్రతాపరుద్రీయమున నుదాహరించెను. తెలుఁగు బసవోదాహరణమున నంకితాంకపద్యము కానరాదు. ప్రాచీనాంధ్రభాషా విశేషములు, ఛందో విభక్తిసంప్రదాయముల నెఱుంగుట కీకృతులు భాషావేత్తల కుపయుక్తము లగుచున్నవి. సోమనాథుని ప్రసన్నభక్తి కవిత్వ మీకృతులయందు విభక్తుల నాశ్రయించి విశేషముగా జాలువారినది. ఉదాహరణమునకు; సార్వవిభక్తికము. (బ. ఉ.)

ఉ॥ నీవు దయాపయోనిధివి నిన్ను నుతించినఁ గల్గుఁ భక్తి నీ
చే వరవీర శైవరతి చేకుఱు నీకయి యిత్తుఁ గబ్బముల్
నీ వలనం గృతార్థత జనించును నీకు నమస్కరింతు నీ
భావమునందునుండి నను బాయకుమీ బసవయ్య! వేఁడెదన్.

ఈమధ్య సోముని పండితారాధ్యోదాహరణమును డా॥ బి. రామరాజుగారు తొలిసారి వెలుఁగునకుఁ దెచ్చిరి. (సా. ప. ప. 54. 3).

4. సోమనాథుఁడు పంచరత్నము లని ప్రసిద్ధి నందిన మాలినీవృత్త పంచకమును బసవపంచక మను పేర వెలయించెను. అట్లే వసంతతిలక వృత్తములందు వృషభాష్టకమును, మాలినీవృత్తములలో బసవాష్టకమును గూడ రచించెను. ఇష్టభావలింగములను త్రివిధలింగముల నొక్కొక్కదాని నెనిమిది అనుష్టుప్ శ్లోకములలో వర్ణించుచు మఱియొక సంస్కృత భక్తికృతి నొనర్చెను.

5. సోమనాథ స్తవ మనియు, భక్త స్తవ మనియు లఘుద్విపద స్తుతి కృతులు సోమనాథుని పేర వినఁబడుచున్నవి.

6. సోమనాథుని వృషాధిపశతకము భక్తిరస శతకవాఙ్మయహారమున నాయక మణివలె వెలుగొందుచున్నది. అష్టభాషావిశారదుఁడైన యీకవి సంస్కృతాంధ్ర ద్రవిడ కర్ణాటక మహారాష్ట్రమణి ప్రవాళాది భాషలలో చంకోత్పలమాలావృత్తములు రచించి బసవని గీర్తించి తనభాషా

పాండిత్యమును సార్థక మొనర్చుకొనెను. "బసవా! బసవా! వృషాధిపా!" యను మకుటమును, అష్టోత్తరశతసంఖ్యానియమమును పాటించిన ప్రిప్రథమాంధ్రశతక మని దీనిని విమర్శకులు కీర్తించుచున్నారు. ఇందు యమకము, అనుప్రాసము, ముక్తపదగ్రస్తము మొదలగు శబ్దాలంకార వైచిత్రులను సోమనాథుఁడు గుప్పించివైచినాఁడు. శతకమున సందర్భానుసారముగా బసవేశ్వరుని యద్భుత మహిమలను మఱికొందఱు భక్తుల కథలను బొందుపఱచి శతకనామమును సార్థకపఱచినాఁడు. సోముని భక్తి పారవశ్యమున కీశతకము చక్కని యుదాహరణము!

7. వీరశైవభక్తి సవైదికముగా వివరించుటకై ప్రామాణికస్తోత్ర గ్రంథమును నిర్మించుతలంపున "చతుర్వేదసార" మను 357 సీసపద్యముల లఘుకృతిని సోముఁడు రచించెను. దీనికి బసవలింగశతక మను నామాంతరము కలదు. ఇందు బసవశబ్దవిచారము, బసవనామోచ్చారణ మహిమ, ప్రకృతి పురుషనామములు, అశుచినిరసనము, చరలింగస్తుతి; శీలలక్షణము, శివానుభవసూత్ర వివరణములు మొదలగు నంశములు బహుశ్రుతిస్మృతి ప్రమాణములతో నిరూపింపఁబడినవి. అతని వేద వేదాంగపారగత్వమున కీకృతి యొక్క తార్కాణము!

8. "చెన్నమల్లు" అను మకుటముతో సోముఁడు 32 సీసపద్యములను రచించెను. శ్రీశైల చెన్నమల్లికార్జునుఁ డతని యిష్టదైవ మనియు, బసవనిభక్తి కుదిరిన తరువాత నాతనినే బసవఁ డని భావించి యభేదభక్తితో నీ పద్యములు సోముఁడు రచించె ననియు విమర్శకుల యభిప్రాయము. కల్కొముులో జీవసమాధిగతుఁ డగునెడ సోమనాథుఁడు ముప్పదిరెండు సోపానములను గ్రమముగా నవరోహించుచు మెట్టున కొక్క పద్యము చొప్పున నీ సీసములు చెప్పె నని ప్రతీతి యొకటి కలదు. బసవేశ్వరుని మేనల్లుఁడైన చెన్నమల్లు పేర నీ పద్యము లాతఁడు రచించె ననియు వాడుక కలదు. ముముక్షువైన భక్తుని చిత్తసంస్కార మీ పద్యములందుఁ గానఁబడుచున్నది.

9. వీర శైవమతమునకు బ్రమాణ భాష్యగ్రంథములుగా సోమనాథుఁడు రెండింటిని వెలయించెను. 1. రుద్ర భాష్యము. ఇది యజుర్వేద

మందలి శతరుద్రీయ మను రుద్రాధ్యాయమునకు (నమక చమకములకు) భాష్య మైయుండు నని విమర్శకులు భావించుచున్నారు. 2. సోమనాథ భాష్యము : దీనికి 'బసవ రాజీయ' మనియు, 'వీరమాహేశ్వర సారోద్ధార' మనియు నామాంతరములు గానవచ్చుచున్నవి. శైవ సంప్రదాయ సర్వస్వమును సంస్కృతమున నిరువదియై దధ్యాయములలో శ్రుతిస్మృతి పురాణేతిహాస ప్రమాణ యుక్తముగా నిందు సోముఁడు నిరూపించెను. గాయత్రీ మంత్రము శివపరముగా నిరూపిత మగుటయు, లింగార్చన ప్రాధాన్యము నుగ్గడించుటయు నీ గ్రంథ విశేషము. వైదికాచార గర్హణ మిందుఁ చేయఁబడక పోగా దాని ప్రాధాన్య ముగ్గడింపఁ బడిన దనియు ప్రభాకర శాస్త్రుల వారు పేర్కొని యున్నారు. హరదత్తాచార్యుల చతుర్వేద తాత్పర్య సంగ్రహమునుండి సోముఁడు పెక్కు శ్లోకములను గ్రహించి యిం దుదాహరించెను. దీనికి మనోహరుఁ డను శైవాగమవేత్త సులభ వ్యావహారికాంధ్ర భాషలో రచించిన వ్యాఖ్యానము పదియవ ప్రకరణము వఱకు లభించుచున్నది.

10. ఇవికాక అన్యవాద కోలాహల మను పేరుగల సోమనాథలింగ శతకము, మల్లమదేవి పురాణము, మొదలగు తెలుఁగు కృతులు 'శీలసంపాదనము, శివగణ సహస్రనామ' యను కన్నడ కృతులను గూడ సోముఁడు రచించె నని విమర్శకులు భావించుచున్నారు.

పై రచనలలోఁ గొన్ని స్తవములు సామాన్యుల కందుబాటులో నున్నను సంస్కృత గద్య పద్యాష్టకములు గీర్వాణ సంస్కార మున్న వారికిఁ గాని యందవు. శతకోదాహరణములు సంస్కార మున్న భక్తుల నాకర్షించినను అనుభవసారాదులు సోమనాథ భాష్యాదులు శాస్త్ర పాండిత్య మున్న పండితులకు గాని యవగాహనము కావు. కావున నీ రచనలతో సోమనాథుఁడు మేధావివర్గమును మతమువైపు మఱలించుకొనుటకు యత్నించినాఁడు. పండితారాధ్య సంప్రదాయ మాతనిలోఁ బండించిన పరిపక్వ ఫలసమూహ మీకావ్య కదంబము !

సోమనాథుని సాహిత్య జీవితమునకు భరతవాక్యముగా పరిఢవిల్లినది పండితారాధ్య చరిత్రము. దీని రచనకును బ్రోత్సాహ మిచ్చినది శ్రీశైలభక్త

కూటమే : సోమనాథుఁడు వీర శైవమునకు పండితత్రియ సంప్రదాయము వలన గల్పించిన యౌన్నత్యమునకు వారి గుర్తింపే యీసత్కృతి.

"ఖ్యాతిగా సద్భక్త గణలాలనముగ-నూతనంబుగ జగన్నుతముగా మున్ను
'బసవపురాణ' మొప్పఁగ రచించితివి ; బసవపురాణ ప్రబంధంబునందు
ప్రథిత పురాతన భక్తగణాను-కథనంబు లితిహాస ఘటనఁ గూర్చితివి ;
వరవీరభక్తి సవైదికంబుగను-విరచించితివి 'చతుర్వేద సార' మన ;
బసవన్న మహిమ శుంభద్భక్తియుక్తిఁ-బ్రసరించితివి గద్యపద్యాదికృతుల ;
నర్ణవావృత ధాత్రియందు దొప్పు బసవ-వర్ణనల్ సేసితి వదనన వీను
లారంగ గురుమల్లికార్జున పండి-తారాధ్యుల చరిత్ర మర్థి వర్ణింపు ;
పరిశిష్ట పరిమిత ప్రాక్తన భక్త-చరితంబు లితిహాస సంగతి నొలయ
సంధింపు పండిత చరితంబునందు-" (పండితారాధ్య చరిత్ర-అవతారిక)

అని భక్తుల యాజ్ఞ. పూర్వము "రచియింపు బసవపురాణంబు నీవు" అనిన వారు ఇప్పుడు "సంధింపు పండిత చరితంబు" అనినారు. జంగమలింగా కృతులుగా బసవ పండితులు శివాకృతు లయ్యును జన్మచే నొకరు బసవావ తారులు; మఱియొకరు ప్రమథావతారులు. శివుఁ డన్నను బసవఁ డన్నను భేదము లేదని వీర శైవ మత తాత్పర్య మగుచుండగాఁ బండితుని బురాణ పురుషుఁ డగు బసవనిగా నిరూపింపరాదు. కావున నాతని చరిత్రి మొక యితిహాసము కావలె నని వారి నిష్కర్ష. ఇతిహాసము "శాస్త్రరూప కావ్యచ్ఛాయాన్వ యిని" కావలె ననికదా ధ్వన్యాలోక మతము. అప్పు డది యుపదేశోపరంజ కత్వ సామర్థ్యము సంతరించుకొనును. పండితారాధ్య చరిత్రి మట్టి పాకమునఁ బడినది. వృద్ధ సోమనాథుని పండిన బుద్ధి దానిని సర్వతోముఖ శేముషితో సమలంకృత మొనర్చినది.

పండితారాధ్య చరిత్రము దీక్షాపురాతన వాద మహిమ పర్వత ప్రకరణ ములుగా విభక్త మై యున్నది. వీరమాహేశ్వరాచారుని జీవితము పంచాచార పంచావరణ నిబద్ధమైనట్లే పండితారాధ్య చరిత్రమును పంచప్రకరణ ప్రసిద్ధ మైనది. ఇందు పండితచరిత్రము ప్రధాన ప్రతిపాద్య మైనను బసవని యొక్కయు పరిశిష్ట భక్తుల యొక్కయు చరిత్రములు కీర్తితము లైనవి. పాండిత్య వీరమున కాలంబన మైన ఆరాధ్య జీవితమున చతుర్వేద పారగుఁ డైన సోముఁడు సార్థకముగా మతశాస్త్రార్థసంపత్తిని నింపిపెట్టినాఁడు. దీనికి

శ్రోత్రిత పాల్కురికి సూరామాత్యుఁడు. సవైదిక మైన వీరశైవ భక్తితత్త్వ మిందు పరమతాత్పర్యము. అదియే బసవనితత్త్వమని వ్యాఖ్యానించినవాఁడు పండితుఁడు. తచ్చరిత్రమున దానిని మిత్రసమ్మితముగా నుపదేశించినవాఁడు సోమనాథుఁడు :

కవిత్వము :

సోమనాథుని కవిత్వము ప్రసన్న గంభీర మయ్యు ధారావేగము గలినది. పాంచాలీవైదర్భీరీతులు గల్గి, ద్రాక్షా కదళీ పాకముల నితని రచనము చవు లూరించు చుండును. రసానుగుణ మైన గుణసంవిధాన మీతని కావ్యములందు సర్వత్ర కానసగును. భక్తి సర్వసాధారణ రస మగుటచే నీతని కవితకు ప్రసాదము సాధారణ గుణము. వీరత్వ మీతని పాత్రలకు సహజ లక్షణ మగుటచే నోజోగుణ మచ్చటచ్చట సమయోచితముగా సంతరింపఁబడును. ముగ్ధభక్తుల చరిత్రలలో మాధుర్యగుణ మప్రయత్నముగాఁ బ్రత్యక్ష మగును. బసవని పేరు తలంచిన మాత్రముననే యొడలెల్ల నాలుక లై కీర్తించు సోమ నాథుఁడు బసవకీర్తనమున కవిత్వమును పరవళ్లు త్రొక్కించును. తా ననుభ వించెడి భక్త్యావేశమును పఠితయందు గల్పించుటకై తన రచనమునే ప్రత్యక్ష విభావముగా రూపొందింపఁగల సామర్థ్య మీతనికి సహజసిద్ధము. పాత్రల బహి రంతః ప్రవృత్తుల నచ్చు గ్రుద్దినట్లు చిత్రింపఁగల నేర్పును, స్వాభావిక ప్రకృతి వర్ణనలను రమణీయముగాఁ దీర్చిదిద్ది కథానుగుణముగా సంధించు కౌశల్యమును, శ్రవణసుభగముగా శబ్దాలంకారములను, సహజసుందరముగా నర్థాలంకారము లను సంతరించుటయును, సూక్తులను, లోకోక్తులను, జాతీయములను సార్థక ముగా వాడుటయును, అల్పాక్షరముల ననల్పార్థ రచన మొనర్చుటయును సోమ నాథుని కవితాగుణములు.

రసభావముల నాయువుపట్టు లెఱింగి వానిని బోషించి కథా ఘట్టములను రక్తికట్టించుట సోముని విద్య. బెజ్జమహాదేవి శివుని లాలించు నెడ వత్సల భావమును, కన్నప్ప శివుని సేవించునెడ ముగ్ధమగు భక్తిభావమును సోమ నాథుఁడు మూర్తికట్టించిన విధ మనన్యసాధ్యము. మాదాంబ వేఁకటి వర్ణనము (1. 644_680) ; బసవేశ్వరుని శిశులీలలు ; (1. 810_850); సూర్యాస్తమయ చంద్రోదయ వర్ణనములు (3. 181_210); (3. 365_405); సంగళవ్వ కొడు కును పిలుచు ఘట్టము (4. 495_540) వృషభ వర్ణనము (5. 780_810); కపటగోపాల వర్ణనము (6. 1400_1425); బసవని విషభక్షణ ఘట్టము (7. 400_580) మొదలగునవి బసవపురాణమున రసవద్వర్ణనాఘట్టములు. పఠిత యూహ కేమియు వదలక సమగ్రముగా విభావస్వరూప స్వభావములను స్వభా వోక్తులలో వర్ణించుట సోముని కవితలో సాధారణముగాఁ గానసగును. ఇందుల కితని ప్రసిద్ధ కుక్కుటవర్ణన ముదాహరణము.

"తొలికోడి కను విచ్చి నిలిచి మై వెంచి
జలజల రెక్కలు సడలించి నీల్గి
గ్రక్కునఁ గాలార్చి కంఠంబు విచ్చి
ముక్కున నీకెలు చక్కొల్పి కడుపు
నిక్కించి, మెడసాచి, నిక్కి మున్సాచి
కొక్కొరో కుర్రని కూయక మున్న"— (పండితారాధ్య చరిత్రము)

బసవపురాణ పండితారాధ్య చరిత్రలలోని ద్విపదలలో పురాణశైలి సరళముగను, చరిత్రశైలి ప్రౌఢముగను గానవచ్చును. వస్తుగౌరవమును బట్టి సుదీర్ఘ సంస్కృత సమాసభూయిష్ఠమైన రచనము నాతఁడు చరిత్రలో చేసెను. ప్రాసవళ్లను గూడ పండితారాధ్య చరిత్రలో నెక్కువ వాడినాఁడనియు, నైనను మితిమీరి పోలేదనియు, అతఁడు రచించిన ముప్పదిరెండువేలకు పైఁబడిన ద్విపద పంక్తులలో నించుమించు నిన్నూరింటిలో మాత్రమే ప్రాసయతిని వాడినాఁడనియు, నందును బసవపురాణమునఁ జాలతక్కువ వాడె ననియు చిలుకూరి నారాయణరావుగారు పేర్కొనియుండిరి. సోమనాథుఁడు బసవపురాణమున కంటె పండితారాధ్య చరిత్రమున ద్విపదను బహుభంగులలో, గతి విశేషములతో నడిపించి యుండెను. మొత్తమునకు ద్విపదచ్ఛందమునకు సోమనాథుఁడు కావ్యమునఁ బట్టము గట్టి చేశి సంప్రదాయమునకుఁ దెనుఁగున ఘంటాపథము వైచిన గౌరవము గడించినాఁడు :

సోముని కందములు మాకందములవలె తిక్కన కందములను బోలి యున్నవి. సీసములు సమతాగుణముతో నైన యొక తూగును గడించి యే పాదమున కాపదము విఱుగుచు శ్రీనాథాదుల సీస రచనలకు మార్గదర్శకము లైనవి. ఇతఁడు ప్రయోగించిన ముక్తపదగ్రస్తాదులు పోతనాదుల నాకర్షించినవి. పోతనగారి "మందారమకరంద" అను సీసపద్యమునకుఁ త్రోవఁజూపిన సీసము చతుర్వేదసారమునఁ గలదు. ఇతని రచనలపై పండితత్రయ ప్రభావమును, ఆంధ్రభారత ప్రభావమును కలదు. అనుభవసారముపై శివతత్త్వసార ప్రభావము సుస్పష్టము. "వైదికు లిది శుద్ధవైదికం బని యన" అను సీసపద్యముపై (చతుర్వేదసారము 23) నన్నయగారి "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని" అను పద్య (ఆదిప, 1.31) ము యొక్క ప్రభావము తేటతెల్లను. తెలుఁగు నుడికారమును, వ్యవహారమున నున్న దేశ్యపదములను తన రచనయం దపరిమితముగాఁ జేర్చుటచే నీతఁడు తెలుఁగున కెనలేని సేవ చేసినవాఁ డయ్యెను.

సోమనాథుని కావ్యములందలి ఛందోభాషా వ్యాకరణాది విశేషములను బేర్కొనవలె నన్నచో నదియొక గ్రంథము కాఁగలదు. ఈ యంశములను వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, చిలుకూరి నారాయణరావుగారు, బండారు తమ్మయ్య

గారలు రచించిన పీఠికలలోను, వ్యాసములలోను, గ్రంథములలోను వివరముగాఁ గాంచవచ్చును.

బసవపురాణ ప్రాశస్త్యము :

వీరశైవ ప్రథమ పురాణమైన యీ బసవపురాణము కర్ణాటాంధ్ర సాహిత్యములపై బలమైన ప్రభావము వైచినది. దానికి మతనుకంటె సోమనాథుని కవిత్వమే ముఖ్యకారణ మనుట సత్యదూరము కాదు. కర్ణాటదేశమున నీ గ్రంథమును బవిత్రమతగ్రంథముగా భావించి పారాయణ చేయుచుండిరి. ఇందలి కథ లనేకము లా సాహిత్యమునఁ బ్రబంధములుగా రూపొందినవి. భీమకవి (క్రీ. శ. 1369) షట్పదివృత్తములలో మూలానుసారముగా దీనిని గన్నడమున ననువదించెను. ఆ తరువాత క్రీ. శ. 1500 ప్రాంతమున సింగిరాజనుకవి మహాబసవరాజ చరిత (సింగిరాజపురాణ) మను పేరను, వృషభాంకకవి (క్రీ.శ. 1655) బసవరాజ విజయ (చంపువు) (వృషభేంద్ర విజయ) మను పేరను అనువదించియుండిరి. ఇంకను పెక్కురీకృతినిఁ గీర్తించి యుండిరి. తమిళమునందును బసవపురాణానువాదము వెలసెనఁట !

ఆంధ్రమునఁ బిడుపర్తి సోమనాథుని పద్యానువాదము మొదట పేర్కొనఁ దగినది. అది సోమనాథునకే అంకితమైనది. ఇదికాక బెజవాడ వాస్తవ్యుఁడును శ్రీపతి పండితారాధ్య వంశ్యుఁడును నగు మహాదేవారాధ్యుఁ డొకయను వాద మొనర్చెను (అముద్రితము). నాగారాధ్యుఁడును తుమ్మలపల్లి నాగభూషణ కవియు బసవవిజయ మను పేర బసవని చరిత్రములను రచించిరి. ద్విపదలుగా యక్షగానములుగా నింకను బెక్కండ్రు తెలుఁగున నీ పురాణమును, తత్కథలను వర్ణించియుండిరి. హరవిలాసమున శ్రీనాథుఁడు సిరియాళునికథను గైకొనియుండుట ప్రసిద్ధముకదా ! ఏలూరులో నారాధ్యబ్రాహ్మణు లగు కందుకూరి వారి పూర్వులెవ్వరో సోమనాథుని బసవపురాణమును స్కాంధాగస్త్య సంవాద రూపమున నగస్త్యప్రోక్తముగా సంస్కృతమున రచించిరి. (అముద్రితము). శంకరకవి యను నాతఁడు సంస్కృత బసవపురాణము రచించె నని కర్ణాటకవి చరిత్రము చెప్పుచున్నది. బసవపురాణమువలెనే సోమనాథుని పండితారాధ్య చరిత్రము వాసికెక్కినది. శ్రీనాథుఁడు దీనిని పద్యకృతిగా రచించెను. నాగులూరి శేషనారాధ్యుఁడు పర్వతప్రకరణమునకుఁ బద్యానువాదము సంతరించెను. దీనినిబట్టి చూచినచో సోముని కృతులలో బసవపురాణమున కెనలేని ప్రతిష్ఠ సాహిత్యజగత్తునఁ గలదని దెలియుచున్నది.

ఇతనిని చెన్నలూరి బసవపురాణకర్త అత్తలూరి పాపయామాత్యుఁడు ''వరసర్వజ్ఞశిఖామణి'' యనియు, పిడుపర్తి సోమనాథుఁడు ''జైనమస్తకవిన్యస్త శాతశూల కలిత బిజ్జల తలగుండు గండ బిరుద శోభితుఁ డనియుఁ,"

గీర్తించిరి. కర్ణాటకవి చంద్రకారు లితనికి "ప్రత్యక్షభృంగీశావతార" "తత్త్వ విద్యాకలాప'' "అన్యవాదకోలాహల" ''కవితాసార'' మున్నగు బిరుదము లున్నట్లు చెప్పిరి. పై బిరుదము లన్నియు సోమనాథుని సమగ్ర వీరశైవ జీవిత మును వ్యజించుచున్నవి.

వీరశైవ వాఙ్మయము మహనీయ మయ్యును పరమత దూషణ మా కృతు లలోఁ గొన్నియెడల నవధి మీరి యుండుటచే నా మతస్థుల కిది మోదావహ మయ్యు సర్వజనామోదదాయకము మాత్రము కాఁజాలక పోయినది. అందువలననే సోమ నాథుని కావ్యగుణములు మెచ్చుకొని తమ రచనలలో నచ్చుపడునట్లు వానినిఁ బాటించిన పలువు రాంధ్రకవు లాతనిని బాహాటముగా స్తుతించుటకు మాత్రము ముందుకు రాలేదు. నవ్యులగు విమర్శకు లాతని మతదృష్టిపైఁగాక సాహిత్య దృష్టిపైనను, భాషాదిశాస్త్ర దృష్టిపైనను తమ పరిశోధనలను కేంద్రీకరించిరి. దేశిమార్గాచార్యుఁడైన సోమనాథుఁడు ఒక సాహిత్య సంప్రదాయ ప్రవంతికి భగీరథకల్పుఁడై పండితుల భక్తిపూజల నందుకొనుచున్నాఁడు.

పాల్కురికి సోమనాథుని సాహిత్యముపై మౌలికమైన విమర్శనలు జరి పిన మహనీయులు తెలుఁగు దేశమునఁ బెక్కండ్రు కలరు. వారిలో శ్రీయుతులు బండారు తమ్మయ్య, వేటూరి ప్రభాకరశాస్త్రి, చిలుకూరి నారాయణరావు, నిడుద వోలు వేంకటరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, కాశీనాథుని నాగేశ్వరరావుగారల వంటి పండితులు ఈ సందర్భమున ప్రధానముగా స్మరింపఁదగినవారు. వీరేశ లింగముపంతులుగారి నుండి ఆరుద్రగారి వఱకు నున్న వాఙ్మయ చరిత్రకారులును, బ్రౌను దొరగారినుండి వీరశైవ సాహిత్యముపై వ్యాసములు వ్రాయుచున్న సాహిత్య విమర్శకులును, చిలుకూరి వీరభద్రరావుగారు మొదలగు దేశచరిత్ర రచయితలును, ఈ కవినిగూర్చి ప్రశంసించినవారే.

సంక్షిప్త ప్రతి :

ఇట్టి పాల్కురికి సోమనాథుని బసవపురాణమును మొదట క్రీ. శ. 1896 లో ఏలూరు వాస్తవ్యులు శ్రీ కందుకూరి శ్రీశైల వీరభద్రవరప్రసాద రావుగారు ప్రచురించిరి. ఆపైన 1926 లో నది శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే బరిష్కరింపఁబడి శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారిచేఁ బ్రచురింపఁబడినది. దాని ద్వితీయముద్రణప్రతిని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు పరిష్కరిం చిరి. 1952 లో శ్రీ బండారు తమ్మయ్యగారు బరిష్కరించిన బసవపురాణము శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారిచేఁ బ్రకటింపఁబడినది.

ఈ నడుమ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రసిద్ధ మహా కావ్యములఁ గొన్నింటికి సంక్షిప్తప్రతులను సిద్ధము చేయించి, ప్రచురించి, ప్రజల కందుబాటులో నుండు సరస మైన ధరలకు వాని నందింపవలె నని తల

పెట్టిన కార్యక్రమములో బసవపురాణ సంక్షిప్తప్రతిని సిద్ధము చేసి, పీఠికను పొందుపఱచు భారము నాపై నుంచినారు. శక్తి చాలని వాఁడ నయ్యు సాహిత్యముపై నున్న భక్తిచే నే నీ గురుతర మైన బాధ్యత నంగీకరించితిని. ఈ సంక్షిప్త ప్రతి కాధార మైనది శ్రీ బండారు తమ్మయ్యగారిచేఁ బరిష్కృతమై వావిళ్లవారిచే క్రీ. శ. 1966లోఁ బ్రచురితమైన ముద్రిత ప్రతి. అందలి 12610 ద్విపద పంక్తులలో 5380 పంక్తులను తగ్గించి, 7230 ద్విపద పంక్తులతో నీ సంక్షిప్త ప్రతిని సిద్ధపఱచుట యైనది. ఈ సంక్షిప్త బసవపురాణమున బసవేశ్వరుని చరిత్రమును, అతని సహచరులును, సమకాలీనులు నైన భక్తుల చరిత్రములును చాలవఱకు యథాతథములుగా, నుంచఁబడినవి. దృష్టాంతరూపమున జెప్పఁబడిన ప్రాచీనభక్తులకథలలో వస్తుతత్త్వము చెడకుండ, కథాసంవిధానము కుంటువడకుండ కొన్ని కథలను తీసివేయుట జరిగినది. అచ్చటచ్చట దీర్ఘము లైన వర్ణనములను తగ్గించుట యైనది. కావున నీ సంక్షిప్తప్రతిలో సోమనాథుని బసవపురాణ ప్రధాన ప్రతిపాద్యవస్తువు చెక్కుచెదరక యున్న దని చెప్ప వచ్చును. సంక్షిప్త మొనర్చిన భాగమును "*"-గుర్తులతో నిందు సూచించుట యైనది. శ్రీ బండారు తమ్మయ్యగారు పైముద్రితప్రతిలో పొందుపఱచియున్న 'అర్థవివరణ పట్టిక'లోని యర్థములను గైకొని పాఠకసౌకర్యార్థ మీ గ్రంథమున నథస్సూచికలలో నందించుట యైనది. విరామచిహ్నములఁ గూర్చుట యైనది. శ్రీ తమ్మయ్యగారి కందులకు నాకృతజ్ఞతలు. పండితప్రకాండు లెందఱో కృషిచేసిన సోమనాథుని సాహిత్యక్షేత్రమున వారి బాటలలోనే వారి మాటలలోనే నేనును నడచియు, సోమనాథుని బసవపురాణ సంవిధానమున దేశిపురాణ సంప్రదాయము కలదని కొంత స్వతంత్రించి నిరూపించుటకు యత్నించితిని. విజ్ఞులు దీనిని సహృదయభావముతో గ్రహింతు రని నమ్ముచున్నాను. నే నీ పీఠికలో సోమనాథుని గూర్చి వ్రాసినదానికంటె వ్రాయక మిగిలినదే యధికముగా నున్నది! క్షయము లేని కళాపూర్ణుఁడీ సోముఁడు! అతనినిగూర్చి యెంత వ్రాసినను చంద్రుని కొక నూలుపోగు సామెతకే వచ్చును!

నా కీసదవకాశము కల్పించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికిని, ప్రత్యేకముగా అకాడమీ కార్యదర్శులును, విద్వజ్జన పక్షపాతులును, సాహిత్యసేవాధురంధరులు నైన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికిని నా హృదయపూర్వక కృతజ్ఞతా వందనములు!

హైదరాబాదు
1-1-1969

గూడ వేంకట సుబ్రహ్మణ్యం

శ్రీరస్తు

# బసవపురాణము

## ప్రథమాశ్వాసము

### అవతారిక

శ్రీ గురుదేవు సంచితగుణోత్తంసు,
యోగీంద్రహృదయపయోజాతహంసుఁ,
బరమకృపామూర్తి, భక్తజనార్తి
హరుఁ, ద్రిజగత్స్ఫూర్తి, నానందవర్తి,
భవరోగవిచ్ఛేది, భక్తవినోది,
శివతత్త్వసంపాదిఁ, జిరతరామోది,
నిత్యస్వరూపు, సునిర్మలత్వప్రతాపుఁ,
బ్రత్యయగతపాపు, భక్తప్రదీపు,
భావనాతీతు, సద్భావనోపేతు,
సావయవఖ్యాతు, నమితు, నజాతు,
నాద్యంతరహితు, వేదాంతార్థసుహితు,
విద్యాత్మసహితు, సంవిత్సౌఖ్యమహితు,
భక్తపరాధీను, భక్తనిధాను,
భక్తసమాధాను, భక్తావధాను,
భక్తపరంజ్యోతి, భక్తవిభూతి,
భక్తదుఃఖారాతి, భక్తానుభూతి,
భక్తవ్రజత్రాణు, భక్తధురీణు,
భక్తజనప్రాణుఁ, బరమకళ్యాణు,

మన్మనోరమ్యు, నిర్మలభావగమ్యుఁ,
జిన్మయు, సౌమ్యు భజించి, కీర్తించి ;
యుల్లమున మదీయవల్లభుఁ జెన్న
మల్లికార్జునదేవుఁ దెల్లగా నిలిపి ;
సముదితసారూప్యశాశ్వతతనులఁ
బ్రమథులఁ ద్రిభువనప్రథములఁ దలఁచి ;
ప్రకటలింగైక్య పురాతనభక్త
నికరంబు శివునంద నిష్ఠించి కాంచి ;
వ్యక్తలింగముల సద్భక్తిరసాభి
షిక్తుల నూతనభక్తులఁ దలఁచి ;
బసవచరిత్ర యివ్వసుమతి మీఁదఁ
బసరింతుఁ దత్కథాప్రౌఢి యె ట్లనిన :—
శ్రీమన్మహాదేవుసింహాసనంబు,
హైమవతీశువిహారస్థలంబు,
హరునిభక్తులకు నేకాంతవాసంబు,
పరమయోగులకు హృత్ప్రమదావహంబు,
నరులకుఁ గర్మసంహరణైకహేతు,
వరయంగ సురలకు నాశ్రమభూమి,
సకలతీర్థములకు జనయిత్రి యగుచుఁ
బ్రకటింప నొప్పు శ్రీపర్వతేంద్రంబు ;
ఉర్విఁ దత్పర్వతసార్వభౌమునకుఁ
బూర్వవక్త్రాంకవిస్ఫురణ దొల్కాడ
నొలసి కుమారశైలోత్తంసలీలఁ
దిలకించి పెంపారుఁ ద్రిపురాంతకంబు ;
తత్త్రిపురాంతకస్థానవాస్తవ్యుఁ
డై త్రిపురాంతకుం డభినుతిఁ బేర్చు;
నాపురసంహారు నపరావతార
రూపితఖ్యాతినిరూఢిఁ దలిర్చు;
నాసదాశివమూర్తి యవితథైశ్వర్య

భాసురచరలింగపటుదీప్తిఁ బరఁగు
నాకాలకంధరు ననవద్యహృద్య
సాకారవిభ్రమవ్యాప్తిఁ బెంపారు
నా దేవువీరవ్రతాచారసార
మేదురస్ఫురణమై మించి వెలుంగు
జంగమరత్నంబు శరణసమ్మతుఁడు
లింగైక్యవర్తి గతాంగవికారి
పండితారాధ్య కృపాసముద్గతుఁడు
మండితసద్భక్తిమార్గప్రచారి
విలసితపరమ సంవిత్సుఖాంబోధి
నలిఁ గరస్థలి సోమనాథయ్యగారు ;
బసవనికారుణ్యరససుధావార్ధి
నసదృశలీల నోలాడుచు నిత్య
నియమవ్రతాచారనిరుపమనిష్ఠ
క్రియగొనఁ దత్త్వనిర్ణయము సంధిల్ల
నతులగోష్ఠీసుఖస్థితిఁ బేర్చుభక్తి
మతినియమంబుల మల్లినాథుఁడును ;
నాదివేదాంతసిద్ధాంతపురాణ
వేదశాస్త్రాగమవిహితమార్గములఁ
దనుమనోధననివేదనసమగ్రతయుఁ
బనుగొన జంగమార్చనలు సేయుచును
నోలిమై 1 గ్రామసీమాలంఘనవ్ర
తాలంకృతిని బేర్చి యాచారలీల
యసలారఁగాఁ గుమారాద్రికిఁ దూర్పు
దెసను సోపానముల్ దీర్చి పొల్పార
మహితసద్భక్తి సమంచితవృత్తి

1. తానుండు గ్రామము యొక్క పొలిమేరను దాఁటి చరింపక, యున్న గ్రామమునందే నిత్యము తన యాచారవిధుల నిర్వహించుట. ఇది వీరశైవుల చతుష్షష్టిశీలములలో నొకటి.

మహిఁ జను వెంటాల మల్లినాథుఁడును ;
నిరతిశయప్రీతి నిత్యంబు నైదు
శివపీఠపుష్పముల్ హరున కర్పింప
నొక్కనాఁ డొక పువు తక్కువ యైన
గ్రక్కున దననేత్రకమల మర్పించి
భవునిచే నసదృశంబవు కన్ను వడసి
ధ్రువకీర్తిఁ బేర్కొన్న దోచమాంబయును ;
ధీరుండు మున్నయదేవయోగీశు
కూరిమిశిష్యుండు నారయాంకునకుఁ
బుత్త్రుండుఁ బరమపవిత్రుండు విమల
గాత్రాంచితుఁడు నీలకంఠాగ్రజుండు
జగదభినుతుఁడు ప్రసాదావధాని
నిగమార్థవేత్త గోడగి త్రిపురారి ;
లోనుగా సకలభక్తానీక మెలమి
మానితభక్తిసామ్రాజ్యసంపదలు
సిరివిరి వోవంగఁ జిరతరమహిమ
నలరారుచుండంగ నం దొక్కనాఁడు
మండితాసంఖ్యాతమాహేశ్వరులకు
దండప్రణామంబు దగ నాచరించి,
భక్తదయారసపరమామృతాబ్ధి
షిక్తుండ నగుచు గోష్ఠీప్రసంగతిని
''నసదృశం బై యొప్పు బసవపురాణ
మెసకంబుతోఁ జెప్ప నిష్ట మయ్యెడును
వరకథాసూత్రంబు వెర వెఱిఁగించి
చరితార్థుఁ జేయరే కరుణతో" ననుచు
సన్నుతిసేయుచు సత్ప్రహ్వత్వమున
విన్నవించుఁడు, భక్తవితతి హర్షించి
సముదితప్రీతిఁ బ్రసాదావలోక
నము నివ్వటిల్లంగ నన్ను వీక్షించి

“బసవపురాణంబుఁ బసరించుశక్తి
నసలారఁ నొసఁగితి మటు గావునను
రచియింపు బసవపురాణంబు నీవు
నచలితభక్తహితార్థంబుగాఁగ”
నావుడు,—భక్తజనావలియాజ్ఞ
వావిరిఁ దల మోచి వర్ణింతుఁ గవిత :
పాటింపఁ దగిన కర్ణాటభూమికిని
గోటీరమై యొప్పు గొబ్బూరిసంగ
నాయగ్రహారమహాజనోత్తముని
కాయపూజితపాదకమలద్వయుండు
శాంభవవేధదీక్షాసద్విశేష
సంభావితాశ్రితజనసముత్కరుఁడు
సురుచిరప్రణవవిస్ఫురితోపదేశ
చరితార్థనిఖిలశిష్యవ్రతానుండు
కింకరనిచయహృత్పంకేరుహాంత
రాంకిత వరసచ్చిదానందమూర్తి
పాత్రుండు భవలతాదాత్రుండు విషయ
జైత్రుండు విమల చరిత్రుండు సకల
భువనపావనమూర్తి బుధచక్రవర్తి
ప్రవిమలకీర్తి సద్భక్తిప్రపూర్తి
యని వినుతింపగ నాచార్యమహిమ
మనుచుండు మండెఁగ మాదిరాజనఁగ ;
నామహాత్ముని సముద్యత్కృపాపూరి
తామృతహస్తకృతావతారుండు
నా గురుదేవు పాదాబ్జ సౌరభ్య
భోగలీలా వరపుష్పంధయుండు
నాశివయోగి యుదాత్తమూర్తి ప్ర
కాశితహృత్పద్మ కర్ణికాంతరుఁడు
నాదివ్యదేహు దయాకలితప్ర

